# వీరాబాయి



గ్రంథకర్త:

పండిత ఈ. భాష్యకాచార్యులు,

రిటైర్డు ప్రధానాంధ్రోపాధ్యాయులు,

హిందూ హైస్కూలు, తిరువల్లిక్కేణి, మదరాసు



ది మోడరన్ పబ్లిషర్సు (రిజిష్టర్డు)

తెనాలి :: బెజవాడ

1947

 [వెల రు. 1-4-0

# వీరాబాయి

గ్రంథకర్త:
పండిత ఈ. భాష్యకాచార్యులు,
రిటైర్డు ప్రధానాంధ్రోపాధ్యాయులు,
హిందూ హైస్కూలు, తిరువల్లిక్కేణి, మదరాసు

ది మోడరన్ పబ్లిషర్సు (రిజిష్టర్డు)
తెనాలి :: బెజవాడ
1947

 [వెల రు. 1-4-0

## PAPER OPINION.

# VEERABHAI

A historical novel. By E. Bhashyakacharyulu, Chief Telugu Pandit, Hindu High School, Triplicane, Madras. Printed at the P. N. Press, Tirupati. Price, Re. 1.

Many points of historical importance in the reigns of Udayasimha of Chitodu in Rajaputana and Akbar, the great Moghul Emperor, are noted in the novel. The valour and diplomatic rule of Veerabhai are beyond all description. Her message to Akbar shares all the traits of skilled statesmanship. Her tactful speech, now as a piece of advice and now as a command to her husband to go to fight, is very impressive and inspiring. In spite of her bitter rivalry with Akbar who imprisoned her husband and put her to ceaseless troubles she generously pardons him and allows him to go unarmed, when he craves for peace falling a victim into the hands of Sarojini who was about to kill him, thus observing the strict rule of Rajadharma-forgiveness. The Grithastasrama rules are clearly set forth in the speeches of the King and the Queen on the occasion of the wedding celebration of Ballabhanu with Sarojini

This book illustrates various morals from the Sastras. In writing this book the author displays his deep knowledge of history, natural science, economics and philosophy. There can be no doubt in saying that the learned author has, by this book made a distinct contribution to Telugu fiction.

6-2-1929. Hindu.

# విషయసూచిక

| విషయము. | | | పుట. |
|---|---|---|---|

శ్రీరస్తు

# వీరాబాయి

## మొదటి ప్రకరణము

## ఒక ఫకీరు

చిమ్మచీఁకటు లెల్లెడలఁ గ్రమ్మి భయము గలిగించుచుండెను. ఎట్టయెదుటఁ గన్పట్టునవెట్టిగుట్టలైనను జిట్టిపొట్టిలుగఁ దోఁచుచుండెను. ఆనాఁడు కృష్ణపక్షద్వాదశియగుటచేఁ జంద్రుఁడస్తమించియుండుట నిజనాథుని యవసానమునకుఁ గుంది తేజోహీనములగు తారకలు పిసినిగొట్టుచేతి సొమ్మువలె, నుండియు నుపయోగశూన్యము లగుచుండెను. నల్గడల నిశ్శబ్దముగ నుండు నాసమయమున నగరాధిదేవతా నిద్రాసమయమువలెఁ దోఁచుచుండెను. రాజవీధులందక్కఁ దక్కిన సందు గొందుల స్తంభదీపములు లేమి నావట్టు లంధకారమున కావాసభూములై యొప్పుచుండెను. రాజభటరక్షితములయ్యు నట్టి సందు గొందు లాసమయమున ధైర్యవంతులకే కాని యన్యులకు సంచారయోగ్యములుగా నుండెను. అయ్యవిగొప్ప వెడల నించుక విశాలముగ నుండినను జాలవఱకిరుకుగనే యుండెను. నాగరకపరిపూర్ణమగు నగరమధ్యమునను నట్టి సందుగొందులుండుట యెంతయునాశ్చర్యము గలిగించుచుండెను.

ఆతరుణమున ఢిల్లీనగరము సందడి యొక సందుదారిని ఘోరాక్కఁ దరుగుచుండెను. ఆతనియంగములు ముడుతలు పడక మాంసపుష్టులైయుంట నాతఁడు వృద్ధుఁడగునని యేరును గనిపెట్టఁ జాలనట్లుండెను. దారినేఁగునాతఁ డీతీరునఁ దలపోయ సాగెను.

"ఔరా! వీనిదుండగ మంతకంత కభివృద్ధమగు చున్నదే! ఇందులకుం దగుప్రతీకార మెట్టిదగును? ఇట్టివాఁడు నొక సార్వభౌముఁడే! రాజపుత్రుల వాఁడికోలలచవిఁ జూచి యెఱుఁగఁడు కాఁబోలు! ఒకరిద్దఱురాజపుత్రులు దనకులొంగి యుండినంతన రాజపుత్రుల శౌర్యాగ్ని చప్పగంటెనని తలఁచు చున్నాఁడు. గాలితగిలినపుడది ప్రజ్వరిల్లునని తెలియకున్నాఁడు. సిసోదియావంశ మెప్పుడేనిం దన్ను మ్రింగఁ జాలునంతటి బలము గలదనుట మఱచెఁగాఁబోలు! 'సారోజాపూర్న్' అనునుత్సవమున నాఁడు వేసమున లోనికి వచ్చి ప్రాణములు గోలుపోవ నుండునపుడు, శరణాగతుఁడగుటచే బ్రదికివచ్చిన యొక రాజ పుత్రికాంతకడనేకదా! ఇంతలో నదియంతయువిస్మరించెనే! కలిమింగన్నులు గానకున్నాఁడు-కానీ. చూతము. రక్షకుఁ డగు నా పృథ్వీరాయలుండ వీనిప్రయత్నమించుకయుసఫలము గానేరదు.

ఆహా! ఏమి యాతనిసామర్థ్యము! నాయజాగ్రత్తచే నెట్టి లోటును బాటిలకుండులాగున ముసల్మానులకుందగు నుడుపులఁ గుట్టించి నాచేఁ దొడిగించెను. ఈ వేసముతోడ నేనింటి కేఁగఁగ నాచిన్నకట్టుఁ డింటిలోనికిరానీకుండెను. ఇంతలో నా

బాలునిపలుకులు వినుచుండిన వానితల్లి ద్వారముకడ కరుడెంచి 'ఏమి యీ యన్యాయము! ముసల్మానులిట్లు రాజపుత్త్రుల గృహములలోనికి రాఁగడఁగుట పాడియా!' యనెను. నేను 'ప్రేయసీ! నీవునన్నింకను బోల్చుకొనలేకుంటివిగా!' యన నాయలుకును గుర్తించి లోనికి రప్పించుకొని 'నాథా! నాయజ్ఞానకృతమగు నపరాధమును క్షమింప వేఁడెద' ననెను. అలాగున నిరంతర పరిచయమున్న వారిచే సైతము గుర్తింపరాని నన్నన్యు లేలాగునఁ బోల్పఁగలరు ?”

అనితలఁచుచు నాతఁడు వెళ్లుచుండ నింతలో నుషఃకాలమాసన్నమాయెను. దిక్కులెల్లెడలఁ దెల్లవాఱఁ జొచ్చెను. ఇంతకుము నెటుఁజూచిన నేకమై కాన్పించు నిమ్నమహాప్రపంచమిప్పుడు నిమ్నోన్నతమై కానవచ్చెను. కాటుక పిట్టలు గుమిగూడి, యార్యజనులార! అజ్ఞానమునఁ గల్గిన యీనిద్రనుండి మేల్కొని కులోచిత కార్యములఁ జేయఁ దొడఁగుఁడని తెలిపెడివో యనఁ గూయసాగెను. కాకలోకము, లనుదినమును బలియొసఁగు నార్యులకు శుభము గల్గుఁగాకయని యాడుచుండు లాగున శబ్దించుచుండెను. కుక్కుటములు, గూర్కు నెందుట యుదయకాలమున యుక్తముకాదని మేలుకొలుప నుపక్రమించుచు సంభ్రమవశమునఁ బ్రథమవర్ణము మాత్రముచ్చరించుచున్నవో యనఁ 'గూ, కూ' యని ధ్వనిసేయుచుండెను. భృంగములు, మిత్రునిఁ గోలుపోయియు వికాసహీనములుగాని, యీకువలయములనుండఁదగదని వీడుచున్నవో యన నందుండి బయలు వెడలుచుండెను. ఆర్యులొనర్చిన నన్యు లొనర్చినను

దైవప్రార్థన మొక్కటే యథార్థముగలది. కావునవది తెలిసికొనక వ్యర్థముగఁ గలహించుట యెంతయు ననుచిత మని తెల్పు లాగున నార్యులను ప్రభాతపఠన ధ్యానములును బెలివారి ప్రార్థనా రవములు నాకసమున నేకీభవించి యోంకార నాదముఁ బోలె గోచరించుచుండెను.

అప్పుడీ బాటసారి యా యుషఃకాల శీతవాతములు దనపై సోఁకుటచే నించుక యధ్వగమన పరిశ్రాంతి లభించుటచే నుత్సాహవంతుఁడై.

"ఆహా! ఉషఃకాలవాతము లెంతసుఖస్పర్శములు! రేయెల్లఁ గూరుకు లేమిఁ గుందుచుండు నాకిప్పుడు వేయిగుఱ్ఱముల మించునట్టి వేగము నుత్సాహమును గల్గెను. నగరము నందలి జనులు పవలెల్ల నాతప బాధకోర్వలేక శ్రమపడుచును రేయుఁగూడ వలయునంత గాలిలేమిఁ గుందుచు, నీ చల్లనిగాలి తాఁకుటచేఁగదా సుఖనిద్రఁ జెందుచున్నవారు! కాళిదాసునకు మతిభ్రమ గల్గియుండవోవు నని తలఁచుచున్నాఁడను లేకచోఁ దనశాకుంతల నాటకమున "దివసాః ప్రారంభ రమణీయాః" యనుటకుమారు "దివసాః పరిణామ రమణీయాః" యని నుడివియుండునే! నిన్నటి సాయంసమయమున నుండియు నింతవఱకుఁ బ్రయాణ సన్నాహముతోడన కాలము గడచెను. ఇంచుక నేనైన నిదురించినవాఁడను గాను. దీన బడలియేకదా యింత సేపయ్యు నీస్వల్ప దూరమే వచ్చియున్నాను! ఇంక నతిత్వరిత గతి నరుగఁ గలను.

ఔరా! అమరసింహుని తెలివి నేమని కొనియాడఁ గలను. ఎంతయు లోకానుభవము గల్గియుండుటఁ బట్టియే తన నిఘంటువున జగత్ప్రాణనామ మీవాయువునకిడి యున్నాఁడు. జగతినివాసుల మనుగడ కన్నోదక వాయువులు ముఖ్య ముఖ్యతర ముఖ్యతమము లగుచున్నవి. దీననే దీని కావిధాత సదాగతిత్వ మేర్పఱచెనని తలఁతును."

అనితనలోఁ దాననుకొనుచుఁ బోవుచుండెను. అంతఁ బ్రాచీముఖమున నిడిన కుంకుమచుక్కయో యన బాలసూర్యుఁ డుదయించెను. దోషాకరుఁడగు రాజును బాఱఁద్రోలి విజయి యయిన యినుని పతాకములభాతి నున్నత స్థలి నెల్లెడల నెఱ్ఱని యరుణ దీధితులు నెలకొనియెను. లేఁతయెండ లాకసమున నలువలంకులఁ బ్రసరింపఁదొడంగెను. ఎల్లెడలను స్వర్ణపుష్పి రానిరాయనులాగున గోచరించుచుండెను. పసుల మేఁతకొఱకు గొల్లలు బయళులకుఁ దోలుకొని పోవుచుండఁ, గ్రేపులనిటునటుఁ బాఱుచుఁ జెలఁగ, నవలోకనవధాతీతములగు తర్ణకముల వెదుకుచు ధేనువు లరుగుచుండెను. ఆతపబాధకు వెఱచి చెచ్చెరఁ దమ పనులు దీర్చుకొనిరాఁదలఁచి కర్షకులు వృషభములఁ బ్రోత్సాహపఱచుచుఁ బొలములకుఁ దోలుకొనిపోవుచుండిరి. వర్తకులు దమదుకాణములఁ దెఱచున బీగపుగుత్తిని భుజములపై వైచుకొని పరువుపరువునఁ జనుచుండిరి. యమునానదీస్నాతులగు విప్రులు భుజములపైఁ నార్ద్రవస్త్రముల నిడుకొని చేత నొక పాత్రము దాల్చి వేదసూక్తము లుచ్చరించుచు వడివడిగా నిండ్ల కరుగుదెంచుచుండిరి.

పాంథుఁ డాసమయశోభం దిలకించుచుఁ దన మానసమున నెంతయు సంతస మంది.

"ఆహా! ఈకాలమెంత రమణీయముగానున్నయది! ఎల్లరు నుత్సాహవంతులై యున్నవారు. ఈసమయమున నెంత నడిచినను మార్గశ్రమ మొక్కింతయు గోచరించుటలేదు. కార్యభారము పైపైచుకొని చింతాక్రాంతుఁడ నగు నేనే యీలాగున నుత్సాహపూరితుఁడ నగుచుండ సామాన్యులమాట చెప్పనేఁ? సహజశోభ యీలాగున నుత్సాహము నభివృద్ధి వఱచుచుండినను మధ్యాహ్నమునం గలుగంబోవు నాతప బాధం దలంచినంతనే యీవార్షాశ్రమమెల్ల నెట్లో కాందిశీక మగుచున్నది. ఎట్టు లీయాతపబాధ నోర్చువాఁడను? సాయంసమయమువఱకు నెచ్చటేని విశ్రమించి యున్నను గార్యభారముందుల కొడంబడ నీకున్నది. ఇప్పట్టున నేమి సేయువాఁడను? ఇన్నికష్టములకు నీచక్రవర్తియుకదా మూలకందము! ఈతని పూనికయెల్ల సాగుటయుకదా దీనికి నిదానము! ఇంతకును రాజపుత్త్రులు గొందఱు మతాభిమానమును వీడి యీతని ననుసరించుటచేతనే యీకష్టుని యాటలు గొనసాగుచున్నవి.

అమేయపరాక్రములగు నీ రాజపుత్త్రరాజులేల యీలాగున వివేకశూన్యులగుచున్నారు? ఇట్టివా రిప్పటికి నీతనికి లొంగకయుండు మేవాడ్ రాజ్యమును చూచియైనఁ దెల్వి దెచ్చుకొనరాదా? స్వాతంత్ర్యధురంధరులగు నిట్టివారి మూలమునం నెందఱు ప్రజలు కుందుచున్నారు! వీరికింకనైన నీశ్వరుండు సద్బుద్ధినొసంగిన బాగుండును. ఇంతటి గొప్పనగరమునం బ్రవేశి

రాయ లొక్కరుఁడు దక్క నింకెవరు నానరోజునకి సాయ మొనర్చువారు లేరనుట యెంత శోచనీయమగుచున్నది!"

అని తలంచుచు నాఘకి రానందుగొందులఁ బడిపోవు చుండెను.

---

## రెండవ ప్రకరణము

# చితోడు దుర్గము

ప్రకృతము రాజపుటానా యను పేరంబరఁగు రాజపుత్ర స్థానమునఁ గొన్నికొన్ని చిన్న సంస్థానము లుండెడివి. వాని యాధిపతు లెవరికి వారు స్వతంత్రులు కాఁగోరి పరస్పరము పోరుచుండిరి. దీననేకదా పవిత్రమగు నీయార్యావర్తమునకుఁ బారతంత్ర్య మావహిల్లెను. వానిలో జయపురము జోధపురము మేవాడ్ అను రాజ్యములు మూఁడును ముఖ్యములగునవి. వానిలో జయపురాధీశుఁడగు బిహారీ మల్లుఁ డక్బరునకు నిజ తనయ నిచ్చి సుఖముండెను. అప్పటినుండియు జయపుర రాజులు చక్రవర్తిసైన్యమున గొప్ప గొప్ప యధికారములఁ బడయుచుండిరి. జోధపురాధీశ్వరుఁడగు మాల్దేవుఁడు సార్వభౌముని శరణుఁ జొచ్చెను. అటమొదల నితనికిఁ దన సైన్యమున గొప్ప యధికారమిచ్చి చక్రవర్తి తన యాస్థానమునకుఁ గుడి వైపునఁ గూర్చుండ నియోగించెను. మేవాడ్ రాజ్యము మాత్రము స్వాతంత్ర్యము వీడక రాజపుత్ర శౌర్యమును

నిల్చికొని యుండెను. అప్పుడు మేవాడ్ రాజ్యమున కొక దుర్గ ముండెడిది. అది తక్కిన దుర్గములవలెఁ గాక యొక పర్వతాగ్ర మున విశాలముగా బయలు నిర్మింపఁబడి త్రికూట శిఖరము నందలి లంక నిట కెవ్వరు దెచ్చిరను శంకం గల్గించుచుండెను. ఇందింతకు మున్నున్న ఢిల్లీసుల్తానుల దుశ్చర్యలమూలమున రెండు జోహారులు జరిగియుండెను. అద్దాని ప్రాకారకుడ్యము లతికఠినశిలలతోఁ గట్టఁబడియుండెను. ఆదుర్గమునందలి గృహములు కైలాసము సహస్రాక్షునివలసి భీతి నిటదాఁప నుంచిన పిల్లలో యనులాగుననుండెడివి. ఆదుర్గము మేవాడ్ రాజ్యమున కంతయు సందము నిచ్చుచుండెననుట యతి శయోక్తిగాఁజాలదు. దానికిఁ జితోడ్, లేక చిత్తూరు అను నామములు గలవు. ఈదుర్గపు రామణీయకమును దీనియందలి శిల్పచాతుర్యమును దిలకించినవారికెల్ల దీని నాదిని నిర్మింపఁ బ్రోత్సాహ పఱచినవారి బుద్ధివైభవము తెల్లముగా లా గుండెను. కాఁబట్టియే కదా దీనియందు బద్ధాసూయులైన ఢిల్లీ పురా ధీశ్వరులు దానియింతకుమున్ను రెండుమూఁడు మాఱులు దాడి వెడలిరి!

అట్టి దుర్గముండుటం బట్టియే కదా సార్వభౌముఁడగు నల్లా రుసుగూడ నరకునేయుకున్న దీసిపోని యావంశము! వేయేల? బహువత్సరముల క్రిందనే శిథిలమగు నీదుర్గముం జూచు నిప్పటి ప్రేక్షకులు దమ మానసముల నద్దానినుండి మరలింప లే కుందురు. ఈదుర్గవాహనము పర్వత మెట్ట వాలుగనుండుటచే న్యపాణికైనను బ్రాఁకవీలు లేకుండును. దీననే మహమ్మదీయు

సైన్యము లెన్నిమాఱులలో యుద్ధముల నోడి పాఱవలసివచ్చెను. ఇంతదృఢతరమగు దుర్గము నాశ్రయించిన వారయ్యు నసూయా పిశాచముచే నాక్రమింపఁబడి యైకమత్యమున్న నోసరించి కొనుచు స్వసమాన రాజసమూహమును బడయనేరకపోయిరి. కాఁబట్టియే కదా యొకటి వారికి నపాయము గల్గెను! దానరాజపుత్రులనేకులు మరణించుటయుఁ దటస్థించెను.

ఆ కాలమున నీదుర్గమును పాలించుచుండిన వాఁడు బాప్పారావల్ వంశ సంజాతుఁడయిన యుదయసింహుఁడను రాణా. ఇతఁడు సర్వసద్గుణరత్నాకరుఁడని యొప్పుచుండెను. మిత్రుల రసికుఁడై కనికరముగలవాఁడై తన ప్రజల బిడ్డలంబోలెఁ బాలించుచుండెను. ఆయన కేలనో యుద్ధమన్న నీతనికిఁ దల కంటగించిపోవు లాగున నుండెను. ఆ రాజేంద్రుఁడు కావ్యగీతాది శ్రవణములఁ గాలము పుచ్చుచుండెను. కాల క్రమమున నీతని రసికత విషయలోలతగను కనికరము భీరుత్వముగను మాఱినవి. ఈ రాజశేఖరునొద్ద విశ్వాసపాత్రులగు భటు లనేకులుండిరి. ఈతని భార్య వీరాబాయి యీతనికి రాజ్యపాలనాది విషయములలో తోడుపడుచుండెను. ఈబిడ తన ప్రజలఁ గన్నతల్లివలెఁ బోషించుచుండెను. ఈరాణా వేటాడుటయం దభిరుచి మెండు. ఈతఁ డొక్కొక్క సమయమున మృగయావినోదమునకుఁ బోవుచుండ నెన్నియో పులుల నెన్నియో లేళ్ళ నీలాగున ప్రాణహీనములఁ గొన్నిఁటిని ప్రాణసహితములఁ గొన్నిఁటిని దెచ్చుచుండెడివాఁడు.

రాణా యీలాగున వేటాడ వెడలినప్పుడెల్ల వీరబాయి దాను బురుష వేషమును దాల్చి ఖడ్గధారిణియై యాస్థానమునకు వచ్చుచుండును. అప్పు డామె రాజ సింహాసనమునకు మ్రొక్కి చెంతఁగల యాసనమున నాసీనయై రాజకార్యముల నంతయు విచారించుచుండును. ఒక్కెడ నన్యులకు సందేశముల నంపవలసిన రాజునాస్థానము పేర నంపునుగాని తనపే రిడదు. ప్రజలకుమాత్రము రాణాగారి పాలనమున కంటె రాణిగారి పాలన మానందము నిచ్చుచుండెడిది. ఈబిడ తన వచోధోరణిని బ్రజలకు ధర్మచింత నినుమడింపఁజేయుచుఁ బాప చింతల రూపు మాపుచు, శౌర్యాగ్నిం బ్రజ్వరిలఁ జేయుచు, నైకమత్యము నభివృద్ధినొందించుచు, దేశమునుండి దాంద్రుక సిద్ధ్యపోలికఁ బ్రజలునోపకుండఁ బన్నుల రాఁబట్టుచుండును. ఆద్రవ్యమునందును ననేకభాగములు; తోటలు వేయించుట, కాల్వలు ద్రవ్వించుట, సత్రములు గట్టించుట మున్నగు సత్కార్యముల కుపయోగించుచుండును. శత్రురాజులు సైత మామె పేరువిన్న నదరుచుండురు.

ఆదుర్గమునఁ బెక్కువిహారవనములుండెడివి. వానిలో నొక్కటి మిక్కుడు మనోహరముగనుండెను. అది నానావిధ పుష్పఫలభరిత లతావితాన సనాథమై చూపఱమది యుల్లా క్రాంతము గాకుండులాగున నలరుచుండెను. అచ్చట నొక యెల మావినీడ నొకయువకుఁ డాసీనుఁడై యీలాగునఁ దలపోయఁ దొడఁగెను.

"ఔరా! ఏమి యీతని దుండగము! చక్రవర్తియగు నీతఁడిట్టి యక్రమములు జరుపఁ గలఁగుటయా? చెట్టు చెఱకాలమునకుఁ గుక్కమూతిపిందియు పుట్టునఁట నిక్కువము. దిక్కులేని యింట దయ్యాలు చొరఁబడినలాగున నవద యగు నా బాలిక నీలీల వేధింపఁదలపెట్టెఁగా? ఇప్పుడె వీని యుక్కడఁగించెదను. రాజపుత్త్రుల శౌర్యాగ్ని యింకను గనుఁగొన లేదు. చిత్తోడు గడమున మొలచునొక్కొక్క తృణమును బరాక్రమవంత మగునట్టి దని తెలిసికొన్నాఁడు. తృణచ్ఛన్నరూప మగు వీరమూలమున నెంతయు రాజపుత్త్రకన్యకలు బాధల నందుచుండెడివారలో! పాప మాయువతి వీనిబారినుండి తొలఁగుట కెంతకష్టపడుచున్నదో కదా! మామామ మని యుండిన నిట్టి యాపదలు రాకుండెడివి. నిక్కముగ నాతఁడుండిన వీఁడ యింతం గన్నెత్తియైనఁ జూడఁగలఁడా!

కటకటా! అసూర్యంపశ్యయా నమ్మాలిని యింత దూర మాయాపద దప్పించుటకై కాదె కఠినశిలామయమగు నా వనప్రదేశమున నడిచి రాఁగలిగెను! సరోజిని కిట్టిచెలియొక్కతె యుమరివంపులకెంతయు సంతసించెదను. మేనమఱంది యగు నాకంటె నీబిడ మెంతయు నపకారిణి యాయెను. ఆపదలఁ గాపఁజాలని యీబాంధవ్యమువలన లాభమేమి? కఠినాత్ముఁడ నగు నే నిన్నిదినములనుండియు నామెపాలఁకువ గనఁబడితిని. ఇది మిక్కిలి యనుచితము. ఈ యకార్యచరణమునకుఁ బ్రతీకార మక్కన్నియ నిక్కట్టులపాలు గాకుండ రక్షించుటయ యగును.

ఏమి యీయవివేకము ! మాయెల్లర బాధలఁదొలఁగించి రక్షింప నుదయసింహ మహారాజును వీరమాత యగు మీరాబాయియు నుండ నేనేల యీకార్యము నాచరింపఁబూనుకోవలెను? కావున నాబిడ కీయుదంత మెఱుఁగపఱచువాఁడను. తటి యెఱిఁగి కదా వారికిది దెలుప నగును! అంతవఱకును దామసించియుండుట దగవు కాదు. అట్లని తొందరపాటును బనికిరాదు. ఇంక నేమిసేయువాఁడను? ఎట్టులోర్చిన నిది చక్కఁబడఁగలదు? ఆపన్నరక్షణ మొనర్పుటకై బద్ధకంకణులగు నా రాజదంపతుల కీవిషయము దెలుపుటకొక సమయము గావలయునే? తటి యెఱిఁగియే రాజులఁ జూపనగు ననుట యన్యుల విషయము కావున నిప్పుడే వారియెద్ద కరిగెదను. అట్లేని నాచేసిన యుపకృతియేమిటి? నేనెంత యోగ్యుఁడననియుఁ దనయాపద దప్పింపఁ గలననియుఁ దలఁచి కదా మాలిని మాళవమున నాబిడ నాకు వర్తమాన మంపి యుండెను !

ఈమాలిని యింకను రాక యేలొకో తడయుచున్నది! నడిచి వచ్చిన యలయికచే విశ్రమించి యుండనోవును. ఎట్టి ధీరురాలైనను నబలయే కదా! ఆబిడ యిట్టి సమయమున నేద దీర్చుకొనుచుఁ గాలము వుచ్చునంతటి పామరి కాదు. కార్యభారమింకేదియే నుండి యాఁగియుండును? ఈ యూరనామె కేమి పని యున్నది? నూతన ప్రదేశముగుట నాబిడ కిందుఁ బరిచితులెవ్వరు నుండఁబోరు. అట్టియెడ నాలస్యమునకుఁ దగు హేతు వేమియును బొడఁగట్టుట లేదు."

అని యీలాగునఁ దలఁచుచుండు నాయువకుని నేత్రములాకర్ణాంత విశాలములై యాతని ముఖమున కొకవింతసోయగము నిచ్చుచుండెను. బంగరువన్నెగల తనుచ్ఛాయ దేజరిల్లుచుండు నాతని మోముగాంచినంతనె క్రోధోత్సాహములు రెండు నొక్కట బూర్ణమైయున్నట్లు గోచరించుచుండెను. అప్పుడొక యువతి మందగమనమున నాతనిచెంత కరుదెంచెను. యువకుఁడు మాత్ర మన్యపరత నాబిడరాక గనుఁగొనలేదు. యువతియు నాతని యప్పటితీరు నవలోకించి యాశ్చర్యపరవశయై;

యువతి:— ఏమి యీపరధ్యానము? మేనమఱఁదలి పేరు విన్నమాత్రమున నిట్లు పరవశులైన నింక వీక్షించిన నెట్లగుదురో కదా!

ఈమాట లాలకించినంతనె యా యువకుఁడు తిరిగిచూచి యాకార గోపనము గావించుకొనుచు ;

యువక:— బాలా! ఏవీలీలనాడుట పాడియగునే? నే వారివీరివలె స్త్రైణవర్తనుఁడఁగాఁజాలను.

యువతి:— ఆహా! వారివీరివలె మీ రెట్లగుదురు? మేనమఱఁది యగుట నిది భావ్యమగును.

యువక :—బాంధవ్య మొక్కటి యున్నంతనె ముందు వెనుకలారయక ప్రవర్తించువాఁడనని తలఁచితివే?

యువతి:—బాలభానుఁడు సరోజినిం బరిగ్రహించుటలో ముందువెనుక లారయ నవసరమేమి గలదు?

బాలభానుఁడు:-మాలినీ! ఈశ్లేషోక్తులిఁకఁ జాలింపుము

మాలిని:— విశ్లేషబాధితులరగు మీ శ్లేషలతోడ నేమివసి ?

బాలభానుఁడు:— ఆశ్లేషయును బూర్వాషాఢయు నవసరము లేదు. ఇఁక నీమాటలుచాలింపుము. మీచక్రవర్తిని బరవశతలఁ గోరునంతటి పాపిని గాఁజాలను.

మాలిని:—అవివాహితయా నాయువిదను బరకాంతయని భావింపనగునా? దాన మీ కాదోసము సంక్రమింపదు.

బాలభానుఁడు:— అది యేలాగున నుండవచ్చును. వాచికము నాడివితిని. లేఖ యున్నదంటివిగదా? అద్దాని నాకేల చూపకున్న దానవు?

మాలిని:—ఇది మా పత్రిక. దీనిని వీక్షించి యుచితరీతిని గావింపుఁడు.

అని యొకజాబాతని కిచ్చెను. బాలభానుఁడు దాని నందికొని విప్పి యీలాగునఁ జదువఁదొడఁగెను.

ఉ॥ శ్రీకర! బాలభానుఁడ! విశేషగుణోన్నత ! దీనపాల ! న
న్నాకటినాత్మఁ డక్కరివనాలిఁగఁ జేకొనవెంచియున్న వాఁ
డేకరణి న్నహింతునిఁక నెట్లు మనంగలదాన నక్కటా !
వే కరుణించి తోడ్పడుము విక్రమభూమణ వైరి భంజనా!

ఇట్లు
నీ యనుంగు మేనమఱఁదలు
సరోజిని. (ఢిల్లి.)

అని యాకమ్మం జదివినంతన యాతని కాబిడం గాంచ నుత్కంఠ యతిశయించెను. అనాథరక్షణ మవశ్యకర్తవ్య మగుటచేఁ ధైర్యాతిశయమును, నతి యెఱిఁగి రక్షింపక యింత కాల ముదాసీన భావమూనినందున లజ్జాభరమును, చక్రవర్తి యయ్యు నక్బరిట్టి యకార్యములకుఁ గడఁగుచుండెఁ గదా యనుట దలఁపునకు వచ్చుటచేఁ గ్రోధాతిరేకము నాతని మానసమున నొక్కుమ్మడి నుద్భవిల్లెను గాని యాయుత్తరముం జూచినంతన జనియించిన యుత్కంఠ యన్నింటికన్న మిన్నయై నిలిచెను.

బాలభానుఁడు:—ఏమి యీయక్షరములసొంపు! ఏమి యీపద్యపుఁబెంపు! ప్రతిభాశాలిని యగుటయేకాక విదుషీమణియు నగుటమివుల నాశ్చర్యము గల్గించుచున్నది.

మాలిని:—ఆర్యా! రూపమునకుఁ దగుశీలమును శీలమునకుం దగు విద్యయు విద్యకుందగు వినయమును నిపుణమవి యననేల! సర్వసద్గుణములును సంపూర్ణములై యున్నవి. మీరాబిడం బరిగ్రహించినచో రాజకార్యములందు మీకుఁ దోడ్పడుటయేకాక యుద్ధసందర్భములను సహాయభూతయై యుండఁ గలదు.

బాలభానుఁడు:—ఆహా! పరాక్రమశాలినియు నగుచున్నదే?

మాలిని:—రాజపుత్రకాంతలకుఁ బరాక్రమము పుట్టుక తోడన కల్గినదికదా?

బాలభానుఁడు— మనయాందువాండ్ర ధైర్యశౌర్యాదులు నాయెఱుఁగని యవి కావు. ఊరక యడిగితివంతయే. ఈవిషయమున మహారాణిగారు ప్రథమనిదర్శనము. నిస్సహాయవై యింతదూర మరుదెంచిన నీవు ద్వితీయనిదర్శనము. సరి. అది యటుండనిమ్ము. నీవిట నీదినమున విశ్రమించిపోవుటుచితము.

మాలిని:— ఆర్యా! నాచెలి నారాకకై నిరీక్షించుచుండును. కావున నే నిటవిశ్రమించుట సరికాదు. ఇంక మీరాబిడ కొసంగు బదులేమిటి?

బాలభానుఁడు:— రాణాగారి యనుమతిఁబొంది యతిశీఘ్రముగ నామె నాపదనుండి కాపాడఁగలను. ఇదియె నా ప్రతిసందేశము.

మాలిని:— ఇంక నాకు సెలవొసఁగుఁడు, ఆపన్నయాగు నామెను వీరి యాతిథ్యమునకైనను నాలసించుట పాడిగాదు.

బాలభానుఁడు:— అట్లే నాలసింపక వెడలుము.

అంత మాలిని యాతని వీడ్కొని ఢిల్లీపురాభిముఖయై యరిగెను. బాలభానుఁ డొక్కెడ సరోజినిం గాపాడుట యందలి తమకము నొకవైపున రాజసేవయందలి పరాధీనతయు నొకప్రక్క దుశ్చరితుఁడగునక్బరునికడంక నుదయించినకోపము నిన్నియు నొక్కసరి తాండవ మాడుచుండ స్వాయత్తము గాని చిత్తముతోడ నల్లనల్లన నిజగృహాభిముఖుఁడై చనెను.

చుండెను. చండభానువ్యాధుఁడు నిజతేజఃకాండముల నీలోకమును లక్ష్యముపై వైచి గాయపఱచుచుండ నది ఛాయావిశల్యకరిణీ సహాయమున నీబాధం దొలంగించుకొనఁ బూనుచుండెను. మనపాంథుఁ డింకొక యడుగిడినఁ బ్రాణములు పోవునని నిశ్చయించి యాయుద్యానపుఁ గవాటములఁ దీసి లోనం బ్రవేశింపఁదలఁచెను, మరల లోనఁ జొచ్చిన నేమి కీడు మూడునో యని సంశయించి నిలిచెను. తాప మధిక మగుటఁ దాళలేక ధైర్యము చేసి లోనఁ జొచ్చెను.

అంతకుమున్నే యందలి తోఁటకాపరి చెట్లకు నీరు గట్టి మధ్యాహ్నపు భోజనమునకై తన యిరవునకుఁబోవ సమకట్టెను. వానిశిరోజములు వెల్లనై యుంట నాతఁ డశీతివృద్ధుఁ డనుట తెలియవచ్చుచుండెను. సంతత దేహపరిశ్రమ గలవాఁడగుటచే సంధిబంధము లించుకేనియు సడలకుండెను. వాని నిడుపాటి గడ్డము మహామ్మదీయతను వెల్లడి సేయుచుండెను. వాఁడొకచేత సురియయు నింకొకచేత నుసుతలఁ గోతికిన మామిడిపండ్లు గొన్నియుఁబుచ్చుకొని వచ్చుచుండెను. తెరువరి వానిం జూచినంతన వాఁడేమనునో యని చాల భయపడఁ జొచ్చెను. తోఁటమాలి యాతఁడలసియుంట గుర్తించి;

తోఁట:—అయ్యా! ఇటురండు. మార్గాయాసమునఁ గడు బడలియున్నవారు. వీరిట నించుక విశ్రమించునది. ఈ ప్రదేశము స్వస్థలము గా భావింపుఁడు. సంశయింపకుఁడు.

తోఁటమాలి మాటలచే సందియము వాసిన బాటసారి యాతని ననుసరించుచుండెను. అచ్చటి రామణీయకము చూచుచు నత్యంతము సంతుష్టుఁడయ్యెను.

ఆ విహారవనమందలి బాటలన్నియు మెత్తని కంకర వేసి యిరుప్రక్కల నేటవాలుగ నేర్పఱుపఁబడియుండెను. ఆ త్రోవలకిరువంకల చెట్లకునీరు వాఱ ననువుగ ముప్పాతికగజము లోఁతు నరగజము వెడల్పును గల కాల్వ లమరి యుండెను. వీనిలోని నీరు నూటిగఁ బాదులలోని కరుగుట కిటుకలచే నాకాలువలు గట్టఁబడి యుండెను. వీని కిరువైపులఁ గల చెట్ల బంతులలో మూఁడువరుసలు కొబ్బరి మ్రాఁకు లొక దానికొకటి యెనిమిదడుగులదూర మందు నటుల నాటి యుండెను. వాని కావల దాడిమవృక్షములవరుసలు రెండు కనుల పండువు సేయుచుండెను. దాని వెనుక నుండు మావిచాళు లైదు సుగంధఫల భరితములయి దాఁటిపోవువారిమానసము లాకర్షింపఁజాలి యుండెను. అద్దానికవ్వలఁ బలువన్నెల పూవుల వింతగొలుపు పూవుచెట్లు పెక్కులుండెను. తోఁట నడుమనొక కొల నమరియుండెను. మనబాటసారి దేటగ నున్న యాకొలని నీటిం గనఁగొని; "ఔరా! ఈకాసార మెంతరమణీయముగ నున్నది! ఈయుదక మెంత నిర్మలముగ నున్నది. నాయాలయిక దీని నిందు దిగి స్నాన మొనర్చిన బాగుండును గాని చక్రవర్తిగా రిందెవరును నీరాడఁగూడదని కట్టడయిడి యుందురేమో?—ఔను. ఆవిషయమున సంశయ మేమిటి? కాని నాఁడీజలమింత నిర్మలముగనుండు టెలాగున

దానిపైఁ గూర్చుండినవాఁ డచ్చటి చల్లగాలి సోఁకున నట్లే పరుండి నిద్రించెను. అప్పు డిర్వురు మహమ్మదీయు లచ్చటికి వచ్చిరి. వారిట్లు సంభాషింపఁ దొడఁగిరి.

"ఇంకను దిక్కులు చూచుచు నూరకుంటి వేల? వీని నిప్పుడే పరిమార్చకున్న నెంతయు హాని కలుగనోపును. నావలె వీని మాటలు నీవును వినియుంటివి కదా? అట్లుండ నింక నీయౌదాసీన్య మేల?"

"తొందరపా టెప్పుడును బనికిరాదు. దాననన్ని యాపదలు రానోపును. వెనుకఁ జింతించుట వ్యర్థమగును."

"నీమాటలు నాకించుకయు నచ్చుటలేదు. ఇంతకును నీయంగీకారము నాకేల? ఇదె వీని నా యీ ఖడ్గముచే సంహరించెదను."

"వలదు వలదు. వీని వేషముఁ జూడఁ బైరాగులఁ బోలియున్నాఁడు. దూరమునుండి వినుటచే మనమే పొరపడి యుండవచ్చును. హిందువులకు నొక ఫకీరును జంపినచో దానికై దేవునొద్ద నేమి సమాధానము చెప్పఁగలము? మన సుల్తానుగారు కట్టివారినిఁ గారణము లేక సంహరింపఁ దగ దనియు నట్లొనర్చినవా రెంతటి వారైనను మన్నింపఁబడరనియు శాసించియున్నారు. కాఫరులైనను దామాచరింపరు. ఒరు లట్లొనర్చినను సైఁపరు. అట్టుండ నింక ముసల్మానునిఁ జంపినఁ జక్రవర్తి యూరకుండునే?"

"ఇట్లు కొందఱు బూటకపు వేషములు పూని తమ మాయలఁ బామరుల మోసపుచ్చుటచేఁ గదా యీతనిబుద్ధి

యిట్లు మార్పు నొందెను! కావుననే యీతఁడు పూర్వమున్న చక్రవర్తులవలె మతవ్యాపనమున శ్రద్ధవహింపక యున్నాఁడు. ఈ కారణముననే మనయిస్లాము మత మభివృద్ధి నొందక తెవులుదవిలిన సస్యములంబోలె నున్నది. బాబరు కాలమున నెంత వన్నెకెక్కియుండిన దీమతము! అయినది కానిమ్ము. వీని నిప్పుడు చంపక వదలుట యేమాత్రము సరికాదు. ”

“మిత్రమా! నామాట యించుక యాలకింపుము. వీఁడిప్పుడు గాఢ నిద్రాసక్తుఁడై యున్నాఁడు. వీని కాలు సేతులం బంధించి యీతోఁట మాలియొద్దకుఁ దీసికొనిపోవుదము. వానియెఱుక లేక యీతండు వచ్చియుండఁడనుట నిశ్చయము కావున నాతని యిచ్చఁబోవున జరిపింతము.”

“నీమాటల మాత్రము నిరాకరింప నేల? అటులే కానిమ్ము.”

అని వారాపాంథుని కాలుసేతుల బంధించిరి. తెరువరి యింతకుమున్నే మేల్కొని యుండినను నప్పుడు తానేమి సేయుటకు నరియగు తరుణము కానితలఁచి మరల గాఢ స్వపితునివలె నభినయించెను;

“ఔరా! ఎంత మెలఁకువతోఁ గార్యమున నువ క్రమించియునిటు బేల్పనై చిక్కుకొంటినిగాదె! ఈ యాపదనింక నెట్లు తప్పుదును? ఇప్పట్టునఁ గన్నులు విచ్చినఁ దప్పక హాని గల్గును. నిదురించు వానివలె నటించుటయే యుచితము దాన వీరాడుకొనునవియు వినవచ్చును.

అని తలఁచి కదలక మెదలక యట్లేయుండెను. అంతనా మహమ్మదీయులాతని గాఢనిద్రితునిగ భావించిరి. వారు వాని మోసికొని పోవుచు నప్పటికిని మేల్కొనమికిఁ బ్రథమమున నాశ్చర్యము నొందిరి కానీ తుద కాతఁడు మార్గాయాసమునఁగడు బడలి మూర్ఛితుఁడయ్యె నని భావించిరి. మేకుఁదెచ్చి వానిఁ దోఁట కావరియొద్ద నునిచిరి. అతఁడు ఫకీరుం జూచినంతన యాశ్చర్యపరవశుఁడై:

తోఁట:—అయ్యలారా! సలాములు. ఇటురండు. కూర్చుండుఁడు. ఈతని నేల యిటకుఁ దెచ్చితిరి? ఇప్పుడే కదా నే నీతని వాకిలిని నీరానం బుచ్చి వచ్చితిని. ఇంతలో నీతని కేమి వాటిలెను?

సేవకులలో నొక్కఁడు } అట్లైన మీరు పొరపోయితి రనుట కావంతియు లోటులేదు. వీని యాకృతి మాత్రము చూచిన ఫకీ రని నిశ్చయించుట కష్టంగదుఁబోవ పాటు. వీని చేష్టలన్యాదృశము లు. రాజపుత్రులిట్టి వేసములు మనరహస్యములఁ గనిపెట్టుట కప్పుడప్పుడు వచ్చుటగలదు. ఊరును పేరును దెలియక యెట్టి వారి నిచటఁ జేర నీయరాదు. తప్పక వీఁడొక హిందువగుం గాని మహమ్మదీయుఁడుగాఁడు. వీనిం జంపవలెనని నేనుపక్రమించిన నామిత్రుఁ డీతఁడు మాటిమాటికి అడ్డుపడుచున్నాఁడు. ఇంక మాయావిని జంపఁదలఁచి యిటకుం గొనివచ్చితిమి.

చెదరకుండ దాసిముక్కలి వరావరికతోఁ గాచుచుండిరి. దాన నా యరణ్య మప్పటప్పటి కభివృద్ధియగు చుండెను.

అట రాజుగారు వేటకై యరుదెంచి యుండుటచే మాటలకుఁ దగిన తావులు, రాజు మొదలగు వారు వసించుట కనువగు టెంకియు నమర్చఁబడియుండెను. రాజుతోడ వేట కరుగుదెంచుచుండిన భటులలోఁ గొందఱు సవదండ వలదండ యుచ్చులు మొదలగువానిఁ గొనివచ్చుచుండిరి కొంద ఱోరణంబులు సెలకట్టెలు సాధనములు మున్నగువానిం దోడి తెచ్చుచుండిరి. కొందఱు తెరచీరకట్టలు మొదలగు వానిఁ మోసికొని వచ్చుచుండిరి. ఇట్లెల్లరు నాయటవిం బ్రవేశించినంతనె కొందఱు పొదలచెంతకరిగి యీలల వేయుచుండిరి. కొందఱుదప్పెటలఁబఱుచుచుండిరి. కొందఱు బొంగులు దీరియుండి, పేరెము లెల్ల బలుమొకముల తొండములఁ దుండె తుండెములుగఁ జేయుచుండిరి. కొందరు పలలఁ బఱచి పలు వగలఁ బొరిలి పఱతెంచు కుందేళ్ల సంహారించు చుండిరి. కొందరు డేగల నెగఁబోగ వదలి యామూలమునఁ బట్టిన పిట్టల మట్టుపెట్టు చుండిరి. కొంద ఱుచ్చులఁ దవిలి చచ్చునట్లెల్లఁ దెచ్చుకొను చుండిరి. కొందరు బల్లెపుఁ బోటులఁ బ్రదెల్లిన భల్లూకముల నుల్లము సంతసిల్ల పల్లవిల్లిన నీడ్చుకొని వచ్చుచుండిరి. వేట కుక్కలాటవికములగు పెక్కుమృగములఁ జక్కఁబెట్టుచుండెను. రాజుగారు దమ యమోఘ శస్త్రాస్త్రముల ప్రకటముగఁ బ్రయోగించి మృగరాజములఁ దెగటార్చుచు, వనగజములఁ దునుముచు శార్దూలముల మర్దించుచు, భల్లూకములఁ

దుష్ప్రేక్ష్యనేయుచు, మహిమముల విహాతి యొనర్చుచు నుండ వారి వేఁటకతమున నటఁగల జంతుసంతతులసంఖ్య పొడ పడఁ[illegible] చుండెను.

ఆ సమయమున మధ్యాహ్నమగుటచే రాఁబోవు యుద్ధరంగమున వీరాబాయి యభినయింపఁ బోవు పరాక్రమ నాటకమునకుఁ బ్రస్తావనయో యనఁ జండకిరణుఁ డుద్దండ కరమండలముల భూమండలము దహింపఁ జొచ్చెను. పుణ్యాత్ముల యైశ్వర్యము భాతి భాస్కరుని కాంతి యప్పటప్పటి కతిశయించుచుండెను. కమల మిత్రుండయ్యు సూర్యుఁడు కమలాకర శోషకుఁ డాయెను. దప్పికచేఁ దిక్కులు వడకొల్లగుమి యెండమావులఁజూచి కొలఁకులని తలంచి దూరాన నుండి నీరాసఁ బర్వెత్తి వచ్చి యలసి సొమ్మసిలి పడుచుండెను. వనమహిమములు ఘనతర తాపమున కోర్వక తమయునికి పట్టుల వదలి యక్కడి పంకజాకరములఁ బంకిలములు గావించుచుండెను.

అట్టి యెడ నారాజు దనయెదుటఁ గాన్పించు నొక పంచాస్యమును నిజబాణపంచకముచేఁ బంచత్వమొందించెను. అప్పుడు వెనువైపునుండి శార్దూలమొక్కండు దాతసి పైఁబాఱ నులకించుచుండెను. అయ్యదనున నొకతుపాకి వేటు చప్పుడుం బులియఱపు నాతఁడు విని యదరిపడి వెనువైపునఁ దిరిగి చూచి వ్యాఘ్రమొక్కండు చచ్చిపడియుండుట కాశ్చర్య మందెను. ఇంతలోన నొక హాహారావము వినవచ్చెను. అంతఁ జిత్రమునఁ దత్తరమొందిన రాజపరేణ్యుఁడు వేఁటకతమునఁ

గలిగిన యలయికచే నొకయడుగైన నిడఁజాలకుండియు నవని కెట్టియిడుము వాటిలెనో యని యాతురమున నయ్యేలుంగుం బట్టి చోటుగు రైతెఁగి యటకేఁగెను. అచ్చటఁ గ్రొన్నెత్తుటం దడిసినఖడ్గమొక్కండు చేతఁబూనియుండినయొకబాలయోగియు నాతనిచెంతఁ దన్నవే గ్రొత్తతుపాకియుంగలి గజ్జమును లాగ సంసిద్ధమయి యుండునట్లు పడియుండిన యొక మహావ్యాఘ్రదీయ శవమును గాన రాఁగ నత్యంత విస్మితుఁడగుచు నా యోగింద్రునితో;

ఉదయ:— యోగిపరేణ్యా! అహింసా తత్త్వము బాగుగ నెఱింగిన మీరిట్టి యకార్యమున కుపక్రమించుట పాడి యగునా?

యోగి:— చేతఁజిక్కిన మృగముల నెల్ల హింసించు మీరా నాకహింసాతత్త్వ మూపదేశింపఁ బూనెదరు? ఇట్టి పరోపదేశ పాండిత్య మెచ్చట నభ్యసించితిరి?

ఉదయ:— క్రూర జంతువుల నూరకయుటు గావించుట నేరము గాఁజాలదు.

యోగి:— క్రూర సంహారము హింసనఁ జేరదని మీ యాశయము.

ఉదయ:— అగును. నేనట్లే విశ్వసించు వాఁడను.

యోగి:— అట్లయిన నాచేయాచరించిన కార్యము సరి యగునదియే.

ఉదయ:— అదెట్లు? ఇతఁడు క్రూరుఁ డగుట కేమి నిదర్శనము?

యోగి:—రాజచంద్రా! తెల్పెద వినుఁడు. తొలుదొల్త ఈతని జాడఁ జూడఁగనే నాకించుక సందేహముదయించెను. అది మొదలీతని కెఱుక పడకుండఁగనే వెంటనంటి వచ్చుచుంటిని రాజమార్గ ముండ వీఁడీ దుర్గమారణ్యమును జొచ్చుటచే ఈతనిపైఁ గల సంశయ మినుమడించెను. అంత మఱింత వేగముగ వీనిం దరియఁ బోవుచుండ వీనిచేతఁ దుపాకియొండు గన్పట్టెను. ఇంక నాలసించుట సరి కాదని తలఁచి వీనిఁ బట్టఁబోవ నంతలోన నీ నీచుఁడు మీపై గుఱిపెట్టి కాల్చెను. ఆ వేటు తాఁకున మీపైఁబడ నుంకించిన యాపులి మరణించెను. మరల మీపై గుఱిపెట్టుచుండ నంతలోఁ గటారిచే నీతనిం దెగటార్చితిని. రాజద్రోహికిం దగు దండన మిదియే యని నేను విశ్వసించుచున్నాఁడను.

ఉదయ:—మీరానతిచ్చినట్లు రాజద్రోహికి దండనము యుక్తమగు నదైనను వీఁడేటు నిష్కారణముగ నను సంహరింపఁ దలఁచుట కడువింతగ నున్నది. వీనికే నెన్నండు నెట్టిసంకటము నేఁ గల్గించిన వాఁడఁగాను. అట్లుండ నీతనికి నాపై నింత పగ గల్గుట కేమి కారణ ముండనోవును ?

యోగి:—వీనికిం గాకున్న నింకెవరికిఁ మీపై ద్వేష ముండరాదా ? వారికొఱకీ నీచుఁ డిట్టి యకార్యము నాచరింపఁ గడఁగి యుండరాదే !

ఉదయ:—నాకేరుం బగతురు లేరనియే భావించుచున్నాను.

యోగి:—చక్కఁగ నాలోచించి పలుకుఁడు.

ఉదయ:—ఇటనాలోచింప వలసిన దేమి గలదు ? ప్రత్యక్షము సాధింప ననుమాన మావశ్యకమా ?

యోగి:—మీరెద్దానిం బ్రత్యక్షమని తలఁచి యుంటిరో యది మీ మతిభ్రమణము యగును. వినుఁడే వివరించెదను. మీరాజ్యము నపహరింపఁ దలఁచినవాఁడు మీకు శత్రువు గాఁజాలఁడా ? మీకులమున కనుచితములగు పనులు సేయు వారికి మీపై ద్వేషము గల్గదా ?

ఉదయ:—నాకీవిషయ మయోమయముగ నున్నది. దయయుంచి తేటఁబడఁ దెల్పుఁడు.

యోగి:—నీతివిశారదులగు మీకేను విశదపఱుపఁదగిన దేదిగలదు? అయినను మీరడిగినప్పు డూరకుంట పాడిగాదు. కావున వచించెదను. మీరాజ్యవైభవము చూచి చూపోపమి నన్య రపహరింపఁ దలఁచియున్నాఁడు. రాజపుత్రవంశమున కెల్లఁ గళంకము నాపాదించుచుండు నామానసింహాదులు మీపైఁ బగవూనియున్నారు. మీరింక మీరాజ్యమును నెడలను మీయెడలనుమిత్రుల జాగరూకులరై వర్తిపవలయును. స్వబుద్ధి నుపయోగించి మిమురక్షించుకొన వలయునుగాని యెల్లప్పుడు మాకొంట్లరుదెంచి మిమ్ముఁ గాపాడఁజాలరు.

ఉదయ:—దయానిధీ ! నన్నిట్లకారణ వాత్సల్యమునఁ గాపాడిన మీ నామధేయ మెద్ది ?

యోగి:—నా పేరు 'బాలభారతి' యని యందురు.

ఉదయ:—చక్రవర్తి నారాజ్యమపహరింప నున్నాఁడని మీ కేలాగునఁ దెలియును !

యోగి:—నేనాతని దుస్తంత్రముల నరయుచుంట నాకది దెలియును.

ఉదయ:-సార్వభౌమునకుం దింతవిరోధము మీకేల కల్గెను?

యోగి:-మతాభిమానమే యందులకుం దగు కారణము.

ఉదయ:—ఈదినమున నాకతిథులరై మాదుర్గమున కరుదెంచి ననుఁ గృతార్థుం గావింపుఁడు.

యోగి:—నేనొక రాజకార్యమునకై డిల్లీ కరుగుచున్నాఁడను. గౌరవపూరితములగు మీవచనములచే నేను మిక్కిలి సంతృప్తుఁడనైతిని. మరల నింకొక సమయమున నరుదెంచెదను. ఇప్పట్టున మాత్రము నను నిర్బంధింపకుఁడు.

అంత నాయోగి రాజును వీడ్కొని తన దారిఁబట్టెను. రాణాగారు రాజభటుల మూలమున నాశవము నొకచోటఁ బాతిపెట్టించి యలసి యుండుటచే విశ్రమింప దలఁచి తమ పటకుటీరమున కరిగిరి.

ఐ ద వ ప్ర క ర ణ ము.

## అద్భుత జ్యోతిషము

ఒకనాఁటి మధ్యాహ్నమున నొక మహమ్మదీయుఁడొక మేడలోన నిటునటుఁ బచారుచేయుచుండెను. వానిమోము వెలవెలఁబాఱియుండెను. వానిఁజూచినఁ గడుఁ జింతాక్రాంతుఁ

డయి యుండెనని తప్పక తెలియునట్లుండెను. ఇట్లుకొంతవడిఁ నటుఁ దిరుగుచు నున్న గసిరియొక యూపిరి విడిచెను. వాకిటితలుపు నొద్దకు వచ్చెను. ఆక వాటము నటునిటు నూఁచెను. వెలుపల గొళ్లెము వేసి యుంట నతఁ డెంత ప్రయత్నించినను దలుపులు దీయ వలనుపడకుండెను. ఎచ్చటనేని వెడలుటకుందగు మార్గ మున్నదే యని చుట్టుం బరికించెను. దారి యెచ్చటం గేమిం జింతాక్రాంతుఁడయ్యెను. మరల ధైర్యము దెచ్చుకొని “నేఁబిఱికివఁడను గాను. వీరలనిందఱ నొక్క పెట్టున నాయీ చిన్నకత్తిచేబలియీయఁదగిన నెఱమగంటిమి గలవాఁడను. అయినను యుద్ధము లవిశ్వసనీయ జయములు. కావున నా కోఁన తెలిఁగొనఁగకున్న నా పదుపాళ్లిల్ల నుపయోగశూన్యము లగును. దానవీఁటకు రాకమున్న యెద్దేనొకయుపాయము నాచరింప వలయు” నని తలఁచుచు మున్నుబోలె నిటునటుఁ బచారు సేయుచుండ వాస్తునిర్మాణముకొఱకేర్పరచిన సూచీపత్ర (Plan) మొక్కండు గోడం దవిలించి యుంచుటం గాంచెను. అంతం జెంతకేఁగి దానిం జక్కఁగఁ బరీక్షించి చూచెను. అప్పుడా పత్రమున కుత్తరపుఁ గుడ్యభాగమున నొకసిగూఢద్వార మున్నలాగునను నది గూఢాగారకుడ్యము వెనుకవైపున నుండి యీతోఁట వెనుకటి వైపునను వీధిం బడిపోవుట కనువగు లాగునను గోచరించెను. దానిం బొడగాంచి నంత నా మహాత్ముఁడీయాఁడు సంతస మందె;

“ఇచ్చటికే యానీచులు దమ యాలోచనకై యేఁగి యుందురు. దీనిమూలమున నే నాపద దప్పటయ

కాక వారిరహస్యముల నైతము నెఱుఁగఁగలను. దేవుఁ డొక్కఁడుననపానుండిన నెందఱు మానవులెన్ని విఘ్నములు చేసిన నేమి ప్రయోజనము? మనయెన్నిక చొప్పునఁ బను లన్నియుం జక్కఁబడునట్లున్న దేవునిఁ గన్నత్తియైనఁ జూతుమే? నన్నట బుద్ధితోఁగావించి తమపనులం జూచుకొన వారరిగి రంతియ కాని నేనాకడ దప్పి వారిరహస్యములఁ దెలిసి తక్కక వారికి మాప్పు గల్గింతునని యెఱుఁగరైరి కాదె! ఇంతకు సీనూ చీవరనూ చూచినంతమాత్రమున నేగాసిదీతెనని తెలియఁ దగునే! కార్యము సఫలము కాంతిదనుక నెద్దియు నిశ్చయింప ననువుపడదు. ఆప్రదేశమునకుఁ బోయి చూచెదఁగాక'' అని తలఁచి యా పతమున నుండు చొప్పున నుత్తరపుఁగుడ్యభాగము చెంత కరిగెను. గవాక్షములనుండి చక్కఁగ వెలుఁగు ప్రసరించుచుండెను. తెన్మాలను పనివుల జాగరూకతతోఁ గాంచెను. ఎంత పరీక్షించిన నచట ద్వారమున్నటుల నాతనికి గోచరింప లేదు. అంతఁ జింతాక్రాంతుఁడై;

“ఆహా! చిత్రపరము చూచి మానసోయితిఁగదా! దీని నెవ్వఁడేని దనకుఁ దోఁచినలాగున గీచియుండనోపును. గృహ మట్లునిర్మింప వలనుగాకయుఁ బోవచ్చును. పరమున నున్నంతమాత్రమున నిది సత్యమని యెట్లు విశ్వసించితిని. ప్రత్యక్షమునఁగాంచక కేవల మూహాలచే సంతసించి భ్రా నైతిఁగదా!—ఇది యసత్యమగునదనియుఁ దోఁచుట లేదు. పతముచొప్పున నన్నియు నడిపోవుచుండ నిదిమాత్రమసత్య మనుటయెట్లు? దీనితత్త్వ మిద మింతమ్మని యూరయ వలను

"మీరు వచ్చునప్పుడు పద్మాకరము సరోవరమున నీరు ద్రావి యుంటిరి కదా !"

"ఔను. ఎచ్చటనో జరిగినదానిం గంటికెదురం జరిగి నటుల నిట్లు చెప్పుట యేరికి నసాధ్యము. మహమ్మదీయులచే గాకున్న నిట్టి మేధానిధిం జక్రవర్తి యెంతయు నాదరించి యుండును. ఈ హిందూమతాభిమానమే కదా యిట్టి చేటునకు మూలమగుచున్నది !"

"మీ సుల్తానుగారు జాతిమతభేదములు పాటింపక సమబుద్ధులై యుండుట లేదా ?"

"సత్యము. ఇంగితజ్ఞతతో నీడక యేకులము వారలైనను సరియే. ఇష్టమయినచో స్త్రీపురుషు లొండొరుల వివాహమాడ వచ్చునని యనుమతిచ్చియున్నవారు. ఆకారణమునఁదా మింతకు మున్న రాజపుత్రికతో సంబంధము చేసిరి. ఇప్పుడు డోగ్రా రాజపుత్రికన్యకను వివాహమాడ సంసిద్ధులై యున్నవారు. వీరిట్టిపనులు గావించుటచేతనే వీరిరాజ్యమున హిందువులనేకులు గొప్పపదవులం బొందియున్నారు. అట్టి హిందువులయొద్ద సేవావృత్తి మాకెంతయుఁ గష్టము నిచ్చుచున్నది. వారు మద్యము నుపయోగింపక పోవుటయే కాక మాబోంట్లం గూడఁ ద్రావఁగూడదని శాసించెదరు.

"పాదుషాగారు మిమ్ములప్పుడప్పుడు హిందూసర్దారుల యొద్ద సేవ సేయుఁడని పంపుచుండుట లేదా ?"

"అవును. ఈ పదునేను దినములనుండి జానజీగారియొద్ద సేవ సేయుచుంటిమి గాత్రము మాకు మహమ్మదీయకులమునఁ

బుట్టి వారి యొక్క సేవకులైయిన వారు మమ్మెంతయు నీచముగఁ జూచెదరు. ఎంత పనిచేసిన నిది యందరికొనుమని యొక్క కాసైననీయ కుండుటయే కాక మాచేయు సేవలకు మెచ్చుకొనరు. నిన్న సుల్తానుగారు మమ్ముంబిలిచి యొక బంగరు నాణెమిచ్చిరి. అయ్యది యీదిన మర్ధరాత్రమున భీమసింహునింటినుండి యాతని కూఁతుఁ గిల్లాలోని చిత్రమహలునకుం గొనివచ్చుటకుఁ బారితోషికమఁట. తన్మూలమున సింహుని మద్యము త్రావి సుఖించితిమి.''

''ఆవనిత మిక్కిలి సుందరగత్తియ కాదె?''

"ఏమి మీ దివ్యదృష్టి ప్రభావము! మీరెన్నడుం గాంచి యెఱుఁగని యాకన్యక రూపవతి యని గుర్తెఱుఁగుట సామాన్యమే! అట్టిరూపవతి యగుటచేతనే రాజుగారామె యెడఁ బ్రీతులైరి. ఒక్క రాజుగారికనేల? మా—అని యుర్లోకమున, మానవజాతికెల్ల మోహము గల్గకుండునే?''

"నా యద్భుత జ్యోతిషమిప్పుడు కదా మీ కెఱుకఁ బడఁగలదు? మీ రామెను బెండ్లియాడఁ దలంచియున్నవారు.''

"చక్రవర్తిగారు గోరిన యామెను మేము గోరువారమే?"

"నాకడనా దాఁచఁ బెట్టెదరు? అసత్యము లాడిన నల్లాకు మీపైఁ గోపము గల్గును."

"మీ కెల్లం దెల్లమయుండ మమ్మడుగ నేల?"

"నాదివ్యదృష్టికి గోచరింపని దొండుండఁబోదు. అయిన నడుగుట న్యాయము. మీ కన్నియు చెప్పఁగలను.''

"ఒక్కకన్నియ యిద్దఱ వరించుటెట్లు పొసఁగును ?"

హిందువులలో నీ యాచారము గలదు. పూర్వము ద్రౌపదియను నామె యేవుర వివాహమాడెను."

"సరి. మాకిఁక సెలవొసఁగుఁడు"

అని వీరి యీసంభాషణము లాలకించుచుండిన యా మహమ్మదీయుఁడు; "ఓహో! వీరా సరోజిని నపహరింపఁ బోయెదరు? పృథ్వీరాజు లుండునపు డిది యసాధ్యము" అని తలఁచుచు నా సోపానముల మూలమున బయలునకు వచ్చి నాఁటి యాగండము దప్పినందులకు మిగుల సంతోషమునందుచు రాజమార్గమునంబడి పోవుచుండెను.

---

ఆ ఱ వ ప్ర క ర ణ ము

# రాజ్యవిచారణ

ఒక్కనాఁటి యుదయమున వీరాబాయి విందుకొలువున నుండి రాజ్యతంత్రము లారయుచుండ సాహిఖాను బొండా యనువాఁడు లేచి ;

సాహి:— మీ రిప్పటి చక్రవర్తి మతద్వేషము లేని వాఁడనియుఁ గరుణానిధి యనియు నెల్లవారలు దలఁచుచున్నారు కదా ? ఇదియట్టి బూటకము. అతనికి రాజ్యకాంక్ష యెక్కుడు. దాన నెంతటి రాజ్యములో యపహరించి యున్నవాఁడు. ఇంత

యేల? మనరాజ్యమున సైతమచ్చటచ్చట వీలుకొలఁదిఁ గొల్లగొట్టఁ దొడఁగినలాగునఁ గొందఱు జానపదులు నుడివి యున్నారు

వీరా:—మంత్రి సామంతవర్యులారా! వింటిరే మన సాహిదాసుబోండా యొక్క పలుకులు! ఇంక నీవిషయమున నూరకుండుట పాడియగునా? రాజపుత్రులు దమ శౌర్యాగ్నిం జ్వలింపఁజేయకున్న నిఁకను బాగుపడ, జాలదు.

మంత్రులు:—తల్లీ! తలఁచినపుడెల్లఁ బోరునల్పవలె నన్న నెంతకష్టము? దానకష్టము గల్గునట్లు మీ యెఱుఁగని యంశము గాదు. ఉపాయత్రయములను బ్రయోగించియు భుజ మార్గముగఁ బడకున్నం జరమోపాయమున కుపక్రమించుట యుక్తము. మానపూర్వులాచరించిన యుద్ధముల మూలమున మన సేనలోని వీరులనేకులింతకుమున్నే మడిసిరి. మన కిప్పోర వదము గాదని తోఁచెడిని. ఇంతకు మీచిత్తమునకు వచ్చిన లాగునఁ జేయుటకు మేమెల్లరము సంసిద్ధులము.

అంత మంత్రుల మాటలకు మాఱుపల్కనోడి రాణి యూరకుండెను అట్టియెడఁ బ్రతీహారి యొక్కండు వచ్చి యామెం గాంచి "అమ్మా! ఢిల్లీనుండి యొక మహమ్మదీయుఁడు వచ్చి తమ దర్శనమునకై ద్వారముకడ వేచియున్నాఁడు" అని వీరాబాయి యాతని లోనికిం దోడ్కొనిరాననుమతిచ్చెను. దేవియాజ్ఞచొప్పునఁ బ్రతీహారియాతని లోనం బ్రవేశపెట్టెను. వచ్చినయాతఁ డామెకు నమస్కరించి తాఁదెచ్చిన లేఖనందించెను. వీరాబాయి యాతని నుచితాసనాసీనుం గావించి చింతనున్న

దనకు వశవర్తులాలచే నిఃక్షాత్రతేజ మగుఁగంటెనని తలఁచి యున్నాఁడు. ఇప్పుడే వీని గర్వమణంపవలయును. లేకున్న నెంతయు విజృంభింపఁగలఁడు. వేవేగ వానిం ద్రుంప సమకట్టుట పాడియగుఁగాదే!

ఆగ్రహోదగ్రయయి యీలాగున నాడుచున్న యామె యెదుటనేమియు బదులాడ లేక యెల్లరు మౌన మవలంబించి యుండ బాలభానుఁడు లేచి;

బాల:—అమ్మా! వానినణఁగఁద్రొక్కుట యొక లెక్కలోనిదిగాదు. వాఁడేమి యంతటిపోటు మానిసిగా! వలయునేని నేనొక్కరుఁడ వాని యుక్కడఁగింపఁ జాలుదును. ఈమాత్రమునకుఁ బెక్కురేల?

వీరా:—అదుగ మఱచితివి అక్కన్నయ నీమేనమఱఁదలుగాదే!

శేఖావహుఁడు:—ఆహా! మేనరికము నమరియున్నదే!

వీరా:—సాహేబ! నీదొరకు విరోధమగు నీజాబు దచ్చుట కెట్లంగీకరించితివి?

శేఖావహుఁడు:—తల్లీ! నేఁదురుష్కుఁడఁ గాను. దారినడుమ నీయుత్తరమున కెట్టి తోటుం గల్గ కుండుటకై యీవేస మూనవలసెను. ఇంత జాగరూకత గల్గియు నాగ్రా నగరమునందక్బరు నా రామపాలుఁడగు నొక మహమ్మదీయు నొద్దకుఁ బ్రశ్నార్థమరుగుదెంచిన మహమ్మదీయయుగ్మమునకుం జిక్కితిని. మహాత్ముఁడగు నా తోఁటమాలి నాపైఁ గరుణించి నను సంహరింప వలదని చెప్పి యచటనే విడిచి

యాగంతుకుల ప్రశ్నలకుత్తర మొసంగ వేఱొక త్రోవ నరిగెను. అంత నటఁగలయొక్క గుప్తద్వారము మూలమున నాయావరణం దప్పి బైలువడితిని.

బేదనూరు జయమల్లుఁడు:— ఔరా! వాఁడట్టియుపకారముగావించెను ఇప్పటికిఁగదా నామేనత్త సత్పుత్త్రవతియయ్యెను! ఎచ్చట నున్న నేమి? కులాభిమానము మానదనుట సత్యము.

వీరా:— అట్లయిన బాలుఁడు మహమ్మదీయుఁడుగాఁడా?

బేదనూరు జయమల్లుఁడు:— అమ్మా! అతఁడు తురుష్కుఁడు గాఁడు నా మేనమఱఁది యగు నాతఁడు బహుమాయానుదినముల నుండి యిచ్చటన యున్నవాఁడు. ఇన్నిదినములుండియు వాఁడొరులచే గుర్తింపబడకయున్నాఁడు. మహమ్మదీయాహార మాతఁడు భుజించుట లేదు. అచ్చటికొట్టుకొనిపెట్టి సమయము వచ్చినపుడు మన కొఱకు పలువ నావేసముతో నట నున్నాఁడు. జనులుదన్ను విశ్వసించుటకుఁగాఁ దన కుటుంబమున కెల్ల నిట్టివేసమునే వేసియున్నాఁడు. తనతండ్రి పక్వాహారములం దనకుటుంబములోనివారు తినఁగూడదని మూఁడువత్సరముల వఱకు నాచరింపఁదగిన యొక వ్రతమాని యది సమాప్తి నందకమున్నె మరణించెను. కాఁబట్టి తానుం దానిని జరిపించుచుండుటకుఁ జెప్పుకొనుచు నచ్చటి జనులనమ్మించుచున్నాఁడు. వాఁడీవ్యాజమున మహమ్మదీయాన్నము భుజింపకయే కాలముగడుపుచున్నాఁడు. చక్రవర్తి యొసంగు వేతన మాతని

కటుంబ భరణముకకుఁ జాలనందున జ్యోతిష్యుని వేసమూని నానావాసులు సంపాదించు కొనుచున్నాఁడు.

లేఖావహుఁడు:—ప్రశ్నార్థమువచ్చినవారికి నీతఁడిని జరిగిన సంభాషణముల మూలమునఁ జక్రవర్తిగారి యూనతి చొప్పునవారు సరోజినిని బలాత్కారముగఁ బట్టుదలఁచియున్న వారని తెలియుచున్నది కాని యాపృథ్వీరాయలు చెంతనుండు వంటకత్తెగా జరుగనేరదు.

మంత్రులు:—ఇప్పటికిని మించున దేదియు లేదు. ఉపాయప్రయోగో పేతముగు నొక లేఖం బంపుదము. దానదారిం బడక యథాపూర్వముగ నున్న నంతోష ప్రాయము మనకు చేర గేయమగును. ఆవల మీాచిత్తానుసారముగ జరుపవచ్చును.

పిరా:—అట్లే కానిండు, నాకుమాత్రమిందు సమ్మతి లేకుండుటేల ? ఎట్లైనం జితోడు గడమున నొక సింగమున్నదని యూతని కెఱుకపడినఁజాలును, ఇంక లేఖనోపకరణము లందెందు.

అంత నొక సేవకుఁడు గలందాను దెచ్చి యిచ్చెను. రాణి సామదానభేదోపేతముగ నొక లేఖ వ్రాసి దాని సంచెలమీాఁద ఢిల్లీకిఁ గొనిపోను భటులకు నతిచ్చి వేఱొక కమ్మ వ్రాసి పృథ్వీరాయల కిమ్మని ఢిల్లీనుండి వచ్చిన లేఖావహుని చేతి కిచ్చెను. అంత మధ్యాహ్న కాలమగుటచే నాఁటికొలువు చాలించి యంతఃపురి కరిగెను మంత్రి సామంతాదులు వారి వారి యుండికపట్లకేఁగిరి. లేఖావహుఁడా జాబుగైకొని యప్పుడే ఢిల్లీపురాభిముఖుఁడై చనెను.

---

# ధైర్యము

ఆగ్రాయొద్ద నాయకమహమ్మదీయులిద్దఱు తోఁటమాలితో మాటలాడుచుండ నారాయణరామను వెలుపలనొక మహమ్మదీయ వృద్ధుఁడరుదెంచుచు; "నేనిన్నితడవలు మందలించినను బహిరాము ఖానునకుఁ దెలియవచ్చుట లేదు. కాఁ జొచ్చిన వెంటనే తలుపులోవైపునగడియవైచుకొనిచనవలదా? దొంగ లేకేని లోనఁజొచ్చి యిచ్చటి పూవులం బండ్లను మ్రుచ్చిలిన నెండవేఁడిమి నోర్వఁజాలక మహిమతా లెవ్వసిక్కొల్లనిం గాఁచి పెట్టిన దాని మూలమునం గలిగిన సార్వభౌముని కోపమునకితఁడసువులఁ దొఱఁగుటయే కదా ఫలము! చక్రవర్తి కాగ్రహమే కలిగినచో నిదెట్లుం దఱుఁగఁ బోదు. వీఁడిది యెల్లం బాదుషా కల్లుకపడఁ గలదని తెలఁచుచున్నాఁడు కాఁబోలు! వారలు సర్వజ్ఞులరు. కడుజాగరూకతతో మెలఁగకున్నఁ గార్యముచెడునని నేనాడిన సరకు సేయకున్నాఁడు. ఇదిసుల్తానుగారికిఁ దెలుపుదమన్న వీఁడొక మాంత్రికుఁడగుటచే నేమిసేయునోయని భయముగలుగుచున్నది. ఇందుల కేమి సేయువాఁడను? నాకెట్లుం బాలుపోవకున్నది. 'తాఁజెడ్డకోఁతి వనమెల్లఁజెరచె' నన్నట్లు వీఁడు పోనిసెందుటయు కాక యెచ్చటనాకూటికి నీరువదలవలసివచ్చునోయని వెఱపుగలుగుచున్నది." అని యిట్లు తలపోయుచు; "ఓయీ! బహిరాము ఖానూ!" అని యెలుఁగెత్తి పిలుచుచు నాయువవనిం బ్రవేశించెను.

ఆటఁ గోటలోని భటులిరువురు నా యులుకుడు విని గుఱుతుపట్టి యతిభీతులై; వంటయింటి "ఇం దేటిచందమునఁ జిక్కుకొంటిమి. ఇఁకఁ దప్పుటెట్లు?" అని కొందలమందుచు నుద్యానపాలకుంజూచి: "ఆర్యా! మీరాసాహెబు వచ్చుచున్నాఁడు. వాఁడూరకయు మాబోఁట్లపై నెల్లపుడు నేరములు గల్పించి సుల్తానుగారియొద్దఁ గొండెములు సెప్పుచుండును. కాఁబట్టి యింక మేమిట నుండుట దగవుగాదు. మాకు సెలవిం" డనుచు నచ్చటఁగలయొక మఱ్ఱిపొంతకరిగిరి. ఆవటవృక్ష మఱువది గజముల చుట్టుకొలఁతగలిగియుండెను. దానికొమ్మలునలువలంకులఁబర్వియుండెను. అందొక్కొక్క శాఖయుఁ బెక్కులగు నూడలతో నావరియుండి మరకతమండపకాంతి విడంబించుచుండెను. ఆ న్యగ్రోధము కోఁటవెనువైపునకుం గోడనానియుండెను. దానంగలయొకకొమ్మ గోడకావలంగల బయలువఱకు వ్యాపించియుండెను. మధ్యాహ్నకాలమున నాబయలం బసుల మేపుకొనుచుండు గొల్లకఱ్ఱవాండ్రీకొమ్మంగలయూడల మూలమునఁ బైకెగఁబ్రాఁకి యందుండి యావలివైపునం గలదాని యూడల సాయమునఁ గ్రిందికిఁ దిగి యచటి నారికేళముల జెట్లనుండి రాల్పియుండలిపీరానుచుందురు. పిదపఁ దామ వచ్చిన దారినే పోవుచుందురు. ఈ మహమ్మదీయ భటులామార్గముననే యాకోఁటనుండి బయలువడి కాపు దిగినచోట నేరుసు లేమికి సంతసించుచు ఢిల్లీ పుర మార్గముం బట్టిపోవుచుండిరి.

ఇట్లు చాల దూరమేఁగి డిల్లీ పుర ప్రాంతారణ్యము చేరునప్పటికి నచ్చట సాక్షాత్కరించిన వనదేవతయో యనునొక కాంతామణి గానుపించెను. ఆ తరుణామణి యా యింతియుఁ గర్కశస్థలి నడచుటచే నలఁతఁ జెంది యలఁత వాటిన మోముదమ్మి గలిగి వాలివడి యొకపుట్టపై నొరగెను. అంతనావల్మీకాంతర్గతమగు నొక కృష్ణసర్పము 'బుస్సు బుస్సు' మనుచుఁ బైకి లేచి కఱువ నుంకింప నద్దాని పడగ దన యొక చేతం గట్టిగఁబట్టుకొనియెను. ఆ యురగము నిజవాలమున నాబిడ కరముం జుట్టుకొనియెను. దీనిం జూచుచుండిన యా మహమ్మదీయు "హా హా! అబల యగు నీ కిట్టి ధైర్యసాహసము లెట్లలవడెను? ఒక యువతి చీఁకటి రాత్రుల నొంటరిగ నడచుటయుఁ గాటువైవ నముకట్టిన త్రాఁచును సరకుసేయక పట్టుకొనుటయు నిట్టి వింత యిదివఱకుఁ గనియు వినియు నెఱుఁగము" అని యిట్లాడికొనుచు నామె చెంతకువచ్చిరి. వీరిం గాంచినంతన వెఱపంది యాము వ విల్లవనము గదుర నామె మూర్ఛ వెసలిచెను. అంతనా మహమ్మదీయులలో నొక్కఁడు ;

"సుందరీ! భీతిల్లకుము. నిన్నుఁబట్టిచుట్టియుండు నీసర్పము నా కత్తి కెరగాఁగలదు."

అనుచుఁ దన చేతికరవాలమున దానినొక్క వ్రేటునఁ దెగ నేసెను. అంతనాబిడ "హా హా! ఇంక వీరి బారినుండి తప్పుటయెట్లు! ఇంటనుండిన నిట్టి కష్టములు గలుగునో యని యిల్లు వెలువడినందులకుఁ 'దానొకటి దలఁచిన దైవ మొకటి దలఁచె' నన్నట్లాయెను. ఇప్పుడేమి

నేయుదానను?'' అనిచింతింపుచు దిగులొంది వడంకఁజొచ్చెను. ఈమెభీతింగాంచిన యాసర్పహంత ;

"శాంతా! నీచింత దొలఁగుము. నీకువంత గూర్పుమన్న యాపన్నగము నంతమొందించితిని. ఇంకనీ శాంతముగు చూపుల మము సంతసింపఁ జేయుము."

అతనిమాటలువినినంతన భీతయైనయామె శరీరమించుక కంపింప మూర్ఛసెంది నేలపైఁబడఁబోయెను. వాఁ డామె నొకశిలపైఁ బరుండబెట్టి విసను దలకెక్కనసితలఁచి విషహారమగు నొక యోషధం దేఁబనియెను. అతఁడు దివి యేతెగు నదనని తలఁచి యామెందాసి యాయమయందమునకు డెందమున మెచ్చుకొనుచు;

"ఏమినాయదృష్టము ! నేనందమగు నొకహిందూ యువతిం బరిణయమాడఁ గోరియుంటిని. ఈ సుందరి నాకంటఁ బడుట నా మేలుకొఱకే యగును. జమాలఖానుఁడు వచ్చునంతలో నేనిమె నెత్తుకొనిపట్టణముననాయింటం జేర్చుకొందును. అనితర శరణయగు నీపడఁతియు నాకు సులభముగనే వశవర్తిసిగాఁగలదు. దుర్మతమగు హిందూమతమునఁ బడి చెడిపోవుచుండు నీస్త్రీ నస్మన్మతమునఁ జేర్చుకొని దీనిఁగాపాడవలెఁగాన నిది యేమాత్రము పాపము గాఁజాలదు. అనన్యశరణ్యమగు నిస్సహాయను రక్షించుట శరణాగతరక్షణరూప ధర్మమే యగును. ఈమెం ధన్యఁగావించి యాపుణ్యము సంపాదించుకొనువాఁడను.

ఏమినాయవివేకము! బీదవగు నేనీవనితం బరిగ్రహించిన సుగఁ గావఁ గలను? అర్థశూన్యుఁడనగు నన్నీమె బల

# ఢిల్లీనగరము.

చాల కాలమునుండి యార్యావర్తమునకు లలామభూతమైయుండిన ఢిల్లీనగరము పండ్రెండవ శతాబ్దాంతమున హిందూరాజుల వైమత్యము లేమి స్థానేశ్వరము నొద్ద జరిగిన ఘోరయుద్ధమున శహాబుద్దీన్ గోరీ పాలఁబడి యదిమొదలు మహమ్మదీయుల పాలనకు లోఁబడియుండెను. అందీ ధానకము జరుగుకాలమున మొగలులవంశమున కలంకారభూతుఁడైన యక్బరు పాదుషా చక్రవర్తిగనుండెను. అతఁడు తన రాజ్యము హిందూదేశమున స్థిరపరచుటకు హిందువుల తోడ్పాటుండితీరవలయునని యెఱింగి వారితోడ బాంధవ్యము నెఱపుచు మతద్వేషము గొంతవఱకు బోనన యుండచుకొని సర్వమతసాధారణముఁ జూపించుచుకొనుచుండెను. ఒకరి యనుమతి ననుసరించి పోవుట యనుదుర్గుణమాతనియందించుకయు లేదు. ఈతఁడు మిత్రుల శోధకబుద్ధి గలవాఁడు. తన ప్రజల సౌఖ్యము తన సౌఖ్యముగఁ జూచుచుండెడి వాఁడు ఎవ్వరువచ్చి యెట్టి మొఱ పెట్టుకొనినను శ్రద్ధతోడ వినుచు నద్దానికిం బ్రతీకారము సల్పుచుండెడివాఁడు ఇన్ని సద్గుణములుండియు చంద్రునకుఁ గళంకము పట్టినట్లు విషయలోలత్వ మీతని యందుండెను.

ప్రథమమున నాతనికించుక శౌర్యముండెడిది కాని రాజ్యభార మెక్కుడగు కొలఁదియు నయ్యది తగ్గఁజొచ్చెను. అతని రాజ్యములోని ప్రజ లాతనిఁ గన్నతండ్రిగ నెల్లప్పుడు భావించుచుండిరి. ఆహా! యక్బరుయొక్క బుద్ధివైభవ మెంత

ప్రశంసార్హము! తాను సింహాసనమధిరోహించునప్పటికి బాలుఁ డయ్యుఁ దిరుగఁబడిన సరదారులనెల్ల నణఁచి, కొందఱ సంస్థానాధిపతుల నిజస్థానమున సమానాసనాసీనులఁ గావించియుఁ, గొందఱకు బిరుదదానాదులఁ దనిపించియుఁ, గొందఱ బాంధవ్యములచే సన్నిహితులఁ గావించియు నిట్లనేక రాజపుత్ర ప్రభులలోఁ బలువురను రాజపుత్రస్థానమునందుగలవారిం బెక్కురఁ దన యధీనము గావించుకొనెను. ఈ చక్రవర్తి మతాభినివేశము లేనివాఁడగుటచేసి తనమతమవలంబించున్న వారిం బోలెఁ హిందువులకుం గూడ గొప్పగొప్ప పదవుల నిచ్చుచుండెను. దాన హిందువు లనేకు లాతనియెడ సద్భావము గల్గియుండిరి. ప్రజలు పెక్కురు రాజభక్తిం జూపుచుండిరి. కావుననే యాతఁడు రాజ్యమునకు వచ్చినప్పుడు ఢిల్లీ ప్రాంతములు మాత్రమే యాతనికి లోఁబడియున్నను గొలఁదికాలములోననే యనేక ప్రాంతములఁ దనయధీనమునకుఁ దెచ్చుకొనఁగల్గెను.

అక్బరు బాల్యమునుండియుఁ గష్టపరంపరలలోఁ బెరిఁగిన వాఁడు గాఁబట్టి విద్యాభ్యాసము చేయ వీలు లేకుండియుఁ దాఁబడిన కష్టములమూలమునం దెలిసికొనిన యనుభవమే యాతనిరాజ్య పరిపాలనమునకెంతయు నాధార భూతమాయెను. విద్యవలని జ్ఞానము లేకుండియు వినికివలని జ్ఞానము విశేషముగఁ గల్గియుండెను. విద్యాహీనుఁడయ్యు నీతఁడు విద్వత్పక్షపాతిగానుండెను. మిక్కిలి దూరదృష్టి గలవాఁడునై జనులపొగడికకుఁ బాత్రుఁడగుచుండెను. ఈతని సైన్య వ్యవస్థ యెంతయుఁ గొనియాడఁదగినదగును. చక్రవర్తి తనసైన్యముల

బద్ధానురాగులై యుండ నాయనూయాపరులు దమచిత్తములం గల విరోధములఁ బైలువెట్ట వెఱచి లోనసే క్రుళ్లుచుండిరి. వా 'రతివినయుంధూర్తలక్షణం' మ్మనఁ భంగి నక్కవినయములు పెక్కులు చూపుచుండిరి. చక్రవర్తి యిరుతెగలవారిలోనం గొందఱు దనపై ననూయ గల్గి యున్న వారనుట యూహింపక యుండ లేదు. కాని దాని నలక్ష్యము చేసి తనకుఁ దోఁచినరీతినే యాచరించుచు వచ్చెను. వారెవరగునదియుఁ గనిపెట్టుట కుపక్రమింపకుండెను.

ఈ మహానుభావుని రాజధానియగు ఢిల్లీనగరమున నెల్లరు నుత్సాహముతో నుండిరి. కష్టమనుట గలనేనింగాన కుండిరి. ఇంకొసీయూర రాజకార్యములాచరించువారు గొందఱు పొలముల దున్నుకొని ఫలములనందుచుఁ గళకళలాడువారు గొందఱు వర్తకము చేసి యర్థము గడించువారు గొంద ఱిక్కట్టులు గాంచినం బాటుపడువారుగ నుండిరి కాని పెద్దలనాఁటి సొమ్ము వమ్ము సేయుచు సోమరులై పాటునకోర్వక పొట్టపెంచుకొని యుండు వారొక్కరుం గలుగరైరి. పెద్దలదంత లిచ్చి నదానిం దినుచుం గష్టార్జితమగు సొమ్ముతో సరిగాదు. 'ఉత్తమం స్వార్జితం విత్తమ్మనుట' నిక్కువము. కష్టించిన వానికుండు నారోగ్యదశ సోమరులకుండ నేరదు. కష్టి దనయుద్యమములకుం దగు ఫలములిచ్చి యావి చెడకిలాగునఁ గాపాడుచుండును. సోమరి దన యౌవనమునంతయుఁ దగుపనులఁ జేయక నిలువుటచేఁ ద్రుప్పుపట్టి చెడు మన్న యినుపతీగలవలెఁ జెడఁ గొట్టుకొనును.

ఆనగరమునందలి భవనముల శిల్పవైభవము వర్ణనాతీతము. హుమాయూనుయొక్క గోరి చూచియే తీరవలయుంగాని వర్ణింప నలవిగాదు. నగరులో నక్బరుయొక్క మహాలతి విచిత్రముగ నిర్మింపఁబడియుండెను. అయ్యది నేలమట్టమునకంటె నెత్తగుటచేఁ గిందినుండి కొన్ని మెట్లు లమరియుండెను. రాచ మహాలున ముందువైపున గొప్ప శిలాస్తంభముల యాధారమున నెత్తఁబడిన పంచయొక్కటి వెలయుచుండెను. ఆస్తంభము లతివిచిత్రముగ నిర్మింపఁబడియుండుటచేఁ గన్నుల పండువైయుండెను. ఆమహాలు పైభాగమున నొక మేడ యుండెను. దానియందలి కుడ్యములం జెక్కఁగవాక్షములమరియుండెను. ఆమేడపైభాగము గుమ్మటమునాకృతిని నిర్మింపఁబడియుండెను.

ఆపురమున నొకనాఁటిమధ్యాహ్నమున నొక యువతి యటఁగలసందుగొందులఁ బడిపోవుచుండెను. బిత్తరపోయిన చిత్తముతోడ నాబిడ నెత్తిపై ముసుఁగిడి చుట్టుపట్టుల బిక్కిరి చూపులఁజూచుచు నల్లనల్లననడచుచుండెను. ఆయువతియొక్క గమనము నామెచూపులును వీక్షించి యనుమానించిన రాజభటుఁడొకఁ డామెను వెన్నాడెను. వాఁడు మొట్టమొదట నాబిడం గాంచి సంశయించి యామె యుదంతమరయునే తెంచిన వాఁడయ్యు నాయువతియొక్కరూపరేఖావిలాసములం గాంచి యామెం బరిణయమాడ వలయునని తలఁచెను. ఆమెయు వానిచూపులం గాంచినంతనే మనోగతమగు నభిప్రాయముం గనిపెట్టి;

"ఆహా! ఏసితీగుమూడనను ఏడునని తోఁచుట లేదు. ఇంక వీనిబారినుండి తప్పుటెట్లు? ఇంతకు నీరూపముగదా నాకిట్టి సంకటము గల్గుటకుఁ గారణమాయెను! పడఁతులకిట్టిరూపుండుట కంటె వికృతరూపలగుటయే మేలగునని తలఁతును. ధీమంతులు బుద్ధిబలమున శత్రువులలోఁ బఱచుకొని వారిచేఁ దమపనులు నిర్వర్తించుకొనులాగున నిట నాకు విరోధమొనరించిన యీ రూపము తోడ్పాటున నేనిముప్పునుండి తప్పెదఁగాక."

అని తలఁచి, యచ్చట నొకతూర నిలచి వాని నవలోకించెను. తనచూపులకు లోఁబడి వాఁడీమెకుఁ జరణదాసుఁడగుటకు సంసిద్ధుఁడుగా నున్నాఁడని వాని వీక్షించినంతనే కనిపెట్టి యల్లనఁ గనుసన్న చేసెను. ఇంగితజ్ఞుఁడగు వాఁడామె చెంతకురాఁగ నించుక యొదిగి నిలచి;

స్త్రీ:—ఈలీల మేలమాడ నిది గాలముగాదు. నాలుక యొండవాలుమున్నది. అల్లదె కాన్పించుచున్న మాయాపవని కేఁగి యటనుండు వాపికం జల్లఁగ నీరాడి యానీరానినఁగాని నాయంగములు గుదుటఁబడవు. అంతదనుకఁ జింతమాని యీచెంతనుండు చింత్రమూనికడఁ గూరుచుండుము.

భటుఁడు:—నీవలుకులతియుకులకేను మోసపోయెదనని తలఁచితివే? నీవంచనావాక్యములవిశ్వసించి చేతఁజిక్కినదాని విడిచిపుత్తునని తలఁపకుము.

స్త్రీ:—నీ వేసము చూచి యింతవలకు నీ వెంతయు రసికుఁడవని తలఁచితిని. నాపడినది పొరపాటని యిప్పుడుకదా తెలిసికొంటిని !

భటుఁడు:—అదెట్లు ?

స్త్రీ:—మాటయందలి సత్యాసత్యముల గ్రహింపలేనివాఁడొక రసికుఁడే ?

భటుఁడు:— చెంతకురాఁ జింతిలుచున్నావు నీపలుకుల సత్యాసత్యముల నే నేలాగున నిర్ణయింపఁగలను ?

స్త్రీ:—నడివీధి నొకనారింజాయకు నీతివిచారముగదా!

భటుఁడు:-నీవాఁడునది యథార్థమే. నేఁడొందరపడిత నమాట యిప్పుడు తెలియఁగల్గితిని. కాని నాకేలొకో నీపై నింకను విశ్వాస మొదయించకున్నది.

స్త్రీ:— ఇంతచెప్పియు విశ్వసింపనిచో నిట్టికొంటువానిని నెవరు ప్రేమింపగలరు ?

భటుఁడు:—ఆలాగున ననవలదు. నే నామాటనీపై విశ్వాసము లేకుంటఁ బోఁగాదు.

స్త్రీ:—మరెందులకు ?

భటుఁడు:—ప్రథమదర్శనమున నే నీపై నింతటి ప్రీతి గల్గుటకుఁ గారణ మేమంత యూహించియుఁ దెలియకున్నాను. దాన నాకించుక సంశయముగల్గెను.

స్త్రీ:—అందులకుఁగారణమిట్టి రూపవంతునిసృష్టించిన బ్రహ్మకుం దెలియుఁగాని మనకది యేలాగునఁ దెలియఁగలదు ? ఎట్లైనని నిన్నుఁగాఁదని నేనిందుండి తప్పి యెటు పోవఁగలను? దాన నను విశ్వసింపుము.

భటుఁడు.—సరి, అలాగుననే కానిమ్ము.

అంత నావనిత యాయుపవనిలోఁ దిరిగెను. భటుఁడా యుద్యానద్వారమునకడనున్న చింతమ్రాని నీడం గూర్చుండి యుండెను. కొంతవడికి 'గుభీలు' మని యొకశబ్దము వినవచ్చెను. ఇదివినిన యా రాజపురుషుఁడు విస్మితుఁడగుచు నాతోఁటలోనం బ్రవేశించెను. అట నామెం గానమి మిక్కిలి దుఃఖించెను. నలువలంకుల వెదకెను. తుట్టతుదకామె యావాపికలో దూఁకెనని సిద్ధాంతము గావించుకొని తనయజాగ్రత్తనుఁ జాలనిందించుకొనుచు నరిగెను.

---

తొమ్మిదవ ప్రకరణము.

# అక్బరు దర్బారు.

ఢిల్లీ పట్టణమున జక్రవర్తి యాస్థానప్రదేశమెల్లెడలం దెల్లని పాలరాతిచేఁ గట్టఁబడి ప్రకాశించుచుఁ జూడఁ జల్లఁగ నుండెడిది. దానినడుమ నాస్థానమండపము బంగారునులామగలిగి యెసక మెసఁగుచుండెను. దానిపైఁ బెద్ద యొకగుమ్మటముచేఁ దనమరి యుండెను. అద్దానినలువలంకుల నాల్గుశిఖరములు వానిపై నష్టమీచంద్రుని మాడ్కి రాజిల్లుచు రాజతంబులగు నెలవంకలు నాల్గుగా నుండెడివి. ఆస్థానపు గోడపైఁబలు విధములగు చిత్రరూపములు వ్రాయఁబడి యుండెను. కొన్ని చిత్రపటములు కుడ్యములం దగిలింపఁబడి యుండెను. ఈచిత్రము లెల్ల

నాతని యాస్థానమున విఖ్యాతిఁబొందిన పదునెనిమిది చిత్రకారులచే వ్రాయఁబడినవియై యుండెను. దీనిమూలమునఁ జక్రవర్తికిఁ జిత్ర కళాభిరుచి మెండనుట వెల్లడియగుచుండెను. ఈ మండపము నడుమున మయూరాసన ముండుండెను. ఇందెన్నియో రత్నములు చెక్కియుండుట చేసిది దిక్కులం బ్రజ్వరిలఁజేయుచుండెను. దానినుండియే కోహినూరు వజ్ర మనర్ఘమనుట మన కిప్పటికిని దెలిసినవిషయముకదా! ఇట్టి యాస్థాన మండపమున మంత్రిసామంతాది పరివేష్టితుండై యొకనాఁటి యుదయమున నక్బరుచక్రవర్తి సింహాసనాసీనుండై 'ఖానఖాన' బిరుదాంచితుండగు మీర్జాసాహెబుం గాంచి.

అక్బరు.—మంత్రీంద్రా! మనసోమనాథ భట్టుగారు రచించిన కల్పితకులనిరసనము గ్రంథముం జూచితివే! ఈశ్వర సృష్టియం బొడమిన మానవులకెల్ల నొక్కటే జాతి యనియు జాతిభేదములు దర్వాతివారు గల్పించుకొనినవియే యనియు నెల్లర కీశ్వరుఁ డొక్కరుఁడే యగుటఁబట్టి కల్పిత కులములపై నభిమానముంచి యొండొరుల దూషించుకొనుట భగవంతు నాగ్రహమునకుఁ గారణమగుననియు సప్రమాణముగ విశదీకరించియున్నారు. అహింసా స్వరూప మెల్లరకుఁ దెల్లమగు లాగున వివరించిరి.

మీర్జా—అహింసయే పరమధర్మమనుట మన మంగీకరింపఁ దగదు. అట్లైన మన దండయాత్రలు, మృగయావిహారములు నడుగంటఁగలవు.

సోమ.—హింసయన నెట్టిదియో యేలినవారిమనసుకు వచ్చియే యుండును. హింస్రములగు మృగములను వేటాడి తన్మూలమున లోకమునకు ప్రకృతిగావించుటయు యుద్ధములొనర్చి దేశద్రోహులం దునిమి వారి దేశముల రాజస్వాములుగా నొనర్చుటయు వీరిచేం బరిగణింపంబడవు తప్పులే? యేజంతువుల సంహరించుచు నదియొక వేడుకగాం దలంచుటయు, ప్రజాపీడావహములగు పన్నులవిధించి వారికిం గష్టములుత్పాదించుటయు, హింసలోం జేరును. హింసయని రాజకీయ కార్యములు చేయకుండిన రాజునకుం బాపమగును. దండ్యాదండ్యుల నెఱిఁగి శిక్షణరక్షణములొనర్చుటగదా రాజధర్మము!

అక్బరు—భట్టుగారివచనము కడుంగడు శ్లాఘనీయము. ఇట్టి సద్గ్రంథము రచించిన యీ మహానుభావు నెంత కొనియాడియుం దనియకున్నాండను.

మీర్జా—దేవర వచించినట్లాతని మతివైభవమతి శ్లాఘనీయము. అహింసాతత్త్వము దెలియక నేను బాధపడితిని. భట్టుగారి వాక్యములమూలమున నాసంశయము నివారితమయ్యెను.

వీరిటు మాటలాడుచుండగ ద్వారపాలుం డొకం డరుదెంచి సలాములొనర్చి "సార్వభౌమా! చిత్తోడుదుర్గమునుండి వచ్చినయొక లేఖావహుండు దేవర యాజ్ఞాపేక్షితుండై ద్వారమునొద్ద వేచియున్నాండు" డనం జక్రవర్తి వాని రానాజ్ఞ చేసెను. ద్వారపాలుం డాతనిలోం బ్రవేశపెట్టెను. వచ్చినవాండు సార్వభౌమునకు సలాములిడి తాం దెచ్చినజాబు నాతనికి

సమర్పించెను అక్బరాతని నుచితాసనాసీనుం గావించి చెంత నుండు నొక సర్దారునొద్ద నాకమ్మ నిచ్చి చదువు మనెను. రాజు నానతి నాలేఖ నిట్లు చదువఁ దొడఁగెను.

చిత్తోడు.

చక్రవర్తియని పేరిడుకొని డిల్లీనేలు నక్బరుపాదుషా సమ్ముఖమ్మునకు.

ఉదయసింహ మహారాజు నాస్థానము దెలుపువిషయ మేమన ?

మేము మీయాస్థానమునకు రాకపోయినను మీక్షేమ లాభము లారయుచు మీకు మే లొనరింప వలయునని యే యున్నారము గాని మీపై నెన్నండేని విరోధభావ మూను వారముగాము. మీతండ్రియగు హుమాయూను మారాజ్య విషయమునఁ గష్టపడి బహదూర్ షాహాచే నాక్రమింపఁబడిన దాని మా పూర్వుఁడగు విక్రమాజిత్తున కిప్పించి మాకొనర్చిన మేలు మేమెప్పట్టుననేని మఱువఁజాలము. మీ పూర్వులు రాజ్యమునకు వచ్చినది మొదలు మాతద్వేషములు గలిగియు జనుల బాధించియుఁ దమ మతమునఁ గలుపుకొన నిర్బంధ పెట్టియు 'జిజియా' మున్నగు పన్నుల విధించియు నీలాగున ననేక క్రూర కార్యము లాచరించుచుండిరి. మీరు మాత్ర మట్లుగాక హిందూ ముసల్మానుల నైక్యదృష్టిం జూచుచున్నారనియు సహనమే పరమధర్మమని తలంచియున్నారనియు మీయశోదుందుభిధ్వాన మీదిగంతములవఱకు వ్యాపించి ప్రతిధ్వనుల నీనుచుండును. మేమెంతయు సంతసిల్లుచుంటిమి కాని యిప్పుడు మీ

రాజ్యమునఁగలవారియదృష్టహానిచే నవియెల్లమాయుపడెననియు నెల్లరు నెల్లజాతులతో వివాహ మాడదగునని యాజ్ఞచేసి యాకతమునన మీరు రాజపుత్రకాంతా పరిగ్రహము చేసితి రని వినియుంటిమి. అట్లాకర్ణించియు నావిషయమున జోక్యము గలిగించుకొనకయింత కాలమౌదాసీన్యము వహించియుంటిమి.

కొంతకాలమునకుఁ బూర్వము మాయూరినుండి వెడలి వచ్చిన భీమసింహుని తనయురాలగు సరోజని యనుదాని దాని యంగీకారముం బ్రతీక్షింపకయె పెండ్లియాడ నిశ్చయించి కొనిన లాగున మాకర్ణములకు సోఁకుచున్నది. మీబోంట్లు బలులుబలవంత పెట్టుటక్షేమావహము కాదు. ఇట్టివిషయముల మీరాజ్యమునందు హిందూమహమ్మదీయులను మీకుఁ దోడ్పడఁజాలరనుట సత్యము. దేవునకు నియ్యది యసమ్మత మనుట సూక్ష్మబుద్ధి నాలోచించిన మీకే విశదముగాఁ గలదు. మేము మీకు హితకాముల మగుటచే నీయంశ మెఱింగించుట మావిధియనితలఁచి మావని మే మెఱిగ్రితిమి. అటుపైని మీయిచ్ఛవచ్చిన నడచుకొన వచ్చును.

ఇట్లు, మీమేలుగోరెడివి,

ఉదయసింహ సార్వభౌమునాస్థానము.

పాదుషా యిది వినినంత సూత్రన తోఁక ద్రొక్కిన త్రాఁచుమాడ్కి మండిపడుచు;

అక్బరు:—ఔరా! బలవంతుఁడనని భయపడక, చక్రవర్తియని జంకక, యెదురు దిరిగినఁ దనరాజ్యమునకు ముప్పు

వాటియందనుమానము లేక, యుక్తాయుక్త పరిజ్ఞాన మించుకయు లేక యీయుత్తరములనుండిట్టిజాబు వ్రాసెనా! పౌరస్ననాథానుడల దూరముసాయునీ భీకంచు నేడొక వీకుండా యెగా! మీరు హితవచనముల విన్నంగలుగంబోవు మేలెంతయో విననుండిన రాంబోవు కీడునంతయు యగును. ఇంక నిట్టివానికి యుక్తముగు ముట్టింపకుండిన బాగుండదు. మేము గొంత దయదలంచి యూరకుండినందునంగదా యీలాగున మాటలు.

ఇంతకు మున్నా లేఖం జదివిన సర్దారావ్రతిక పరీక్షించిచూచి, "సార్వభౌమా! ఈజాబునందాతని వ్రాలు గాన్పించుటలేదు! ఇందులకేమి కారణమో తెలియదు. చీటికిం బ్రాణంబు వ్రాలనుటచే నిది నిర్జీవలేఖ గావున దీని సరకు సేయరాదని నేదలంచెదను."

ఈమాట లాలకించిన యాసభాసదులెల్ల నాలాగున వ్రాలులేని పత్రిక వచ్చుట కాశ్చర్యపరవశులైరి. చక్రవర్తి దానింగైకొని పరిశీలించి చూచి విస్మితుండై; లేఖావహునిం గాంచి.

అక్బ:—ఇందు మీరాణాయొక్క వ్రాలులేమి కేమి కారణము?

లేఖా:—రాణాగారూరలేరు. వారు వేటకరిగి యున్నారు. కావున మారాణిగారీ లేఖవ్రాసిపంపియున్నారు.

అక్బ:—ఎట్టెట్టు! ఇట్టి లేఖ నాయట్టివానికొక యాండుది వ్రాసిపంపుటయా? ఎంతసాహస మెంతసాహసము! మంత్రి

సామంతులార! సేనాపతులారా! ఇంతదనుక మేవాడరాజ్యము నాకులోఁబడకుండియు మాయుభయులుపూర్వులకున్న మైత్రిం బాటించియూరకుంటిని. అట్టుండియుఁ జక్రవర్తియని నను సరకుసేయక యొక బోఁడుబి యిట్టికమ్మ వ్రాసి పంపియున్నది. ఇంతకంటె నేం డవమానపుచేఁతగలదా? కాఁబట్టి యిఁక నాలసింపక వెంటనేయుద్ధమునకు సన్నద్ధులుగుండు. యీసేనలఁ బురికొల్పుఁడు. రేపు రేపకడ విజయయాత్రయనిసాటింపుఁడు. నాయీమాట కేదు నెదురాడకుఁడు. నాసంగ్రామనామక ఖడ్గమునకు సంపూర్ణాహారము లభించుఁగాక.

అని యిలాగున నాజ్ఞ చేసి మంత్రియగు మీర్జాఖానుం జూచి తావచ్చువఱకు జరుగు కార్యవిధానముల గుఱించి యాలోచింప సాయంకాలము దనరహస్యాలోచనా మందిరమున (ఖుషాల్ ఖానా)కుం దప్పక రావలయునని కట్టడసేసెను. లేఖాసహాయుఁ గాంచి తాను యుద్ధయాత్ర వెడలుచున్నవాఁడనుటయే యాలేఖకుత్తరమని యావత్తిచ్చి యాతని నంపెను. అప్పుడా సభనున్న సులేమానను వాఁడు చెంతనుండు నొక మహమ్మదీయుని సమీపించి రహస్యముగ నీలాగున ననెను.

సులే:—రాణా యిప్పుడిప్పుడు వేఁటాడఁబోవుటగలదు. కావునఁ దఱియెఱిఁగి సంహారింపవలయునని యిబ్రాహీమను వానినింతకుమున్నే పంపియున్నాను. వాఁడకార్యమీపాటికే యాచరించియుండనోపును.

మహమ్మదీయు:—నీ సామర్థ్యము మిత్రులఁగొనియాడఁ దగినది గాని ధర్మాత్ములగు మన పాదుషాగారి లాటి కపట

కార్యములకు సమ్మతింపరు. కాఁబట్టి దీని బయల నుబ్బపీతుము. ఏమాత్రమే నిది బయల్పడిననీకుఁ దప్పక ముప్పు వాటిలునదుట యథార్థము.

ఈలాగున వీరుమాటలాడుచుండ భయభ్రాంతుఁడగు నొకనగరపాలుఁ డరుదెంచి చక్రవర్తిపాదములపై సాగిలఁబడి, పడినవాఁడు లేవక యిట్లియుండ సుల్తానాతని లెమ్మనియానతిచ్చి;

అక్బ:—నీకింత భీతిలుట కేమికారణము? కలరూపెఱింగించినచో నందులకుఁదగుప్రతీకారమాచరించెదము.

నగరపాల:— నేనిప్పుడప్పు డీనగరపు టెల్లలఁ బరికించి వచ్చుట గలదు. అట్లే యీదినమేగి మరలివచ్చుచుండ నొకమహమ్మదీయశవముం గంటిని. అయ్యెడ మూఁపురయెద్దుగుల జాడ గానుపించెను. అం దొక్కటి మృతుఁడగు వానిది. తక్కిన వేరివనుట దెలియలేదు. ఆజాడలీనగరద్వారము పఱకు వచ్చి యున్నవి. అవలినుండి యెద్దుగులజాడలు ద్రొక్కుడువడుటచే గోచరింపకున్నవి. చచ్చినవానియందు మాత్రమించుక బాపజీగారి ద్వితీయపుత్రుని పోలిక గానుపించుచున్నది. ఆకళేబరమున పన్నాఁడిప్పుడే దుర్గంధము వీచుచున్నది. అట నొకమంచె గట్టించి యాశవము నందేయుంచితిని. అటుపైని దేవరచిత్తము.

అక్బ:—ఆహా! నాయేలుబడినిం గూడ హత్యజరుగుటయా! ఎట్టియన్యాయము! నీవరుగుము. నేనంతయువిచారించెదను.

అని యానగరపాలునంపి కొత్వాలునిం బిలిపించి యాశవమును మతానుసరణిని సంస్కరింపించుమనియు; బాపజీగారి

యెఱుఁగకున్నాఁడు. అంతిపురి కరుదెంచిన నను సంతసింపఁ జేయునఁట. వీని మాటలకు లోఁబడ నేఁగూళనుగాను. బీద రాలనయ్యుఁ గులగౌరవమునుఁ గాపాడుకొనుదానఁగాక ద్రవ్య లోభమున నకార్యమున కుపక్రమించు దానఁ గాను. దైవ మించుక కన్ను దెఱచినంతనే తండ్రి యనుభవించిన యిడుములుం దన పడిన చిన్ననాఁటి వెతయు మఱచి యున్నాఁడు. ఐశ్వర్యముబుద్ధిఁద్రాయు మనుట యెఱుఁగఁడు. సతమని తలఁచి యిట్లు మిట్టిపడుచున్నాఁడు. ఇంతకు వీనిన వలయు నదేమిగలదు? స్వార్థపరులగు మనవారు గొందఱీతని చెంతఁజేరి యిట్టి చెడునడవడికలలవడఁ జేసిరి.

అని యిల్లొకనాఁటి రేయిని డిల్లి యందలి యంధకార ప్రాసాదమున నొక యువిద వగచుచుండెను. అప్పుడాకసమునఁ గాఱు మబ్బులు గ్రమ్మి యెల్లెడలఁ జీఁకటులు నిండి యుండెను. దారి నడచువారి కన్నులు మిఱుమిట్లు గొను లాగున మెఱుపులు దళతళమని మెఱయుచుండెను. తొలు దొల్తసన్నని తుంపరలు పడఁ జొచ్చెను పిల్లగాలి యల్లనల్లన వీచుచుండెను. రానురాను బెనుగాడ్పులు వెసవెసఁబఱతెంచెను. కడపల నుండి క్రుమ్మరించిన లాగున జడివాన గురియ సాగెను. గాలివాన డాక కాఁగలేక పెను వ్రాఁకులు విఱిగి పడుచుండెను. మేలొనరించు వారికెన్నియో విఘాతములు గలుగు ననుట దెలియఁ బఱచుచున్నదో యనఁ బెనుగాలి మబ్బులఁ జెదరఁగొట్టుచుండెగాని, యెన్నియిడుములు గల్గెనేనియు గొప్పవారు నరకుసేయరనుట దేటపడులాగున నెంత

తేటగాడ్పులు వీచియు మబ్బులు చెదరక యట్టే నిలిచియుండెను. నెమిళులు పురుల విప్పుకొని సంతసమున నాడుచుండెను. చాతకములు దనివిదీఱ వాననీ రానుచుండెను. కప్పలు కుప్పలు కుప్పలుగ బైలువడి బెకబెకమని రొద సేయుచుండెను. యమున యుభయదరులఁ ద్రెంచుకొని వడిగల సుళ్ళతో నమగడు గునఁగన్నట్టు మొసళ్లతోఁ జూచు వారికి వెఱపు గొల్పు లాగునఁ బ్రవహించుచుండెను. అప్పుడు చెఱకావరియొకఁడు వచ్చి;

చెఱకావరి:—తల్లీ! నీవని పండినది. పాదుషాగారు నీపై నెంతయు నలరియున్నారు. ఇంక నీసుఖము లనుగంటఁగలవు.

స్త్రీ:—నీవు నీచుఁడవు. నీపాదుషా నీచతరుఁడు. మీ రలరిన నేమి? అలిగిన నేమి! మీ మోసములకేను లోఁబడు దానంగాను. ఇంక నీమాయ వేసము గట్టిపెట్టి నీవిట కేల వచ్చితివో తెల్పుము. నిజమాడకున్న నాయీపిడికిట నీప్రాణముఁ దీయుదును.

చెఱకావరి:—అమ్మా! తొందరపడకుము. సుల్తానుగారి యానతిచొప్పున నిను విడిపించుటకై యొకభటుఁడు వచ్చియున్నాఁడు. అతఁడొక యోగితోడ ద్వారముకడ వేచియున్నాఁడు.

స్త్రీ:—ఏమి? పాదుషా నన్ను విడిచిపుచ్చెనా? అట్టివాఁడు మొట్టమొదట నేల చెఱఁబెట్టవలయును? పెట్టినవాఁ డిప్పు డకారణముగ నెట్లు విడుదలసేసెను?

చెలికావరి:—నేనేమెఱుఁగుదును? పట్టుమన్నఁ బట్టుటయు విడువుమన్న విడుచుటయుఁ గదా నాపని!

అని యీలాగున నాడుచువాఁడా తలుపుఁ దెఱచెను. ఆయింతి యచటనుండి వెలికి వచ్చెను. వాకిట నొకతపస్విస్త్రీ యుండెను. చెలికావరి చెప్పినలాగున బంటులేమి కాన్పక్కనది యామెనిం గాంచి;

స్త్రీ:—అమ్మా! మీరలెవ్వరు? మాకోసము దెచ్చిన బంటెవ్వఁడు? అతఁడిపుడెట కేఁగెను? నేనిప్పటికి రావలయునా?
యోగి:—నేనెవ్వఁడ ననదియు నీకిప్పుడుఁ జెప్పఁదగదు. నాతో సరుదెంచిన యాబంటెవ్వఁడనుట నేనెఱుఁగను. నను నీకుఁ దోడ్పడుమని చెప్పి యాతఁ డిప్పటికో యరిగెను. వాన యింక ముమ్మరముగ లేకున్నది. ఇట నింకఁ దడయవలదు.

స్త్రీ:—మీ యెఱుఁగని యొక బంటుతోడ మీరిప్పటి కేలాగున రాఁగల్గితిరి? మిక్కిలి వింతగనున్నయది.

యోగి:—మిక్కిలి చిక్కులంబడియుంట నామాట నమ్మఁజాలకున్నావు. కావున నాయెఱిఁగినంత నాఁగోరిక తెలుపవలసెను. అమ్మా! నీవలె నేనుం జెఱఁబడియుండ నాతనిచే విమోచితుఁడనై యిటకుం గొనిరాఁబడితిని.

స్త్రీ:—మీ రేల చెఱఁబడితిరి?

యోగి:—తెలుపఁదగినంత వఱకుం జెప్పితిని. ఇంతకంటె నింకేదియు నీవిటఁ బ్రశ్నింపఁదగదు.

మనసు గొంతకుదుటఁబడుఁగాక. ఓయీ! నీవెనువైపుననుండు నీయింతి యెవ్వతె?

వీర:—అంతయులోనికింబోయిన పిమ్మట విశదపఱచెదను.

అనంతర మాబిడ వారిని లోనికి రప్పించుకొని తలుపు బిగియించి బిరబిరగదిలోనికరిగి పృథ్వీరాయునకీవార్త దెలిపెను వెంటనె యారాజు దరుదెంచెను. ఆతని యోగివేషము వీక్షించి యాశ్చర్యము నొందెను, దీపపుకాంతి నాతఁడా కాంతను గుర్తించి యత్యంత విస్మితుఁడై:

పృథ్వీ:—ఓయీ! నీకీ వేషమేల దాఁపరించెను? నీవింత కాలము నడయుటకుఁగారణమేమి? తల్లీ! నీవిఁతదనుక నెచ్చట నుంటివి? ఈతని నీవెట్లు కలిసికొంటివి? నీమామగారిల్లుల వాఁడు వాటేయున్నదే? వీరసింగు! నీవీమె నెచ్చట సంధించితివి!

వీర:—అయ్యా! ఆఁకలిచే మేమెంతయు నలమటించుచున్నారము. భుజించినఁగాని యెద్దియు వచియింపఁజాలము. క్షమింపవలయును.

వీరీలాగున మాటలాడుచుండఁగనే యావృద్ధవనిత వారి కాహారపదార్థములనొకపళ్లెరమునఁబెట్టి తెచ్చెను. వారు గడుపార భుజించిరి అంత వారియుదంతముల విన నువ్విళులూరుచు:

పృథ్వీ—వీరసింగు! నీవీమె నెచ్చట సాధించితివి ?

వీర:—అంధకార ప్రాసాదమునొద్ద సంధించితిని.

పృథ్వీ:—నీవచ్చటి కేల పోయితివి ?

వీర:—నన్నొక బంటుటకుం దోడ్కొనిపోయెను.

పృథ్వీ:—నాకేమియు బోధపడలేదు నీవృత్తాంతము నసాకల్యముగా వివరింపుము.

వీర:—ఆ నాఁడేలిన వారి యానతిగొని చనినవాఁడఁ దిన్నఁగ నాగాపట్టణముం జేరితిని. మార్గశ్రాంతుఁడనగుటచే నచ్చటి రాజకీయోద్యానమున నొక సరోవరము ప్రాంతంజేరి విశ్రమించియుంటిని. రాజభటులిర్వు రా ప్రదేశమునకు వచ్చిరి. వారు నను బంధించి యటఁగల యొక హార్మ్యమునంబడవైచి తలుపులు మూసికొని తమపనికై వెడలిపోయిరి. నేనా ప్రదేశము నంగల యొక గుప్తద్వారముం గనిపెట్టితిని. తన్మూలమున నాయున వనము దాఁటి బాటంబడితిని. ఆమార్గమున నేఁగి చితోడునకుం జేరితిని. రాణాగారు వేఁటకై వెడలియుండుటచే రాణిగారియొద్దఁ దమ లేఖఁ జేర్చితిని. ఆమె యాయుత్తరముం గాంచి పట్టఁజాలని కోపమున సుల్తానునకొక లేఖ యంపెను. దేవరవారికొక పత్రిక వ్రాసి యిచ్చెను. నేనద్దానిం గొని యోగి వేషధారినై బయలు వెడలితిని. నిన్న రేయినీయూరం జొచ్చితిని ద్వారపాలు రడ్డగించిరి, వారితోఁ డ నా రేయియెల్ల నచ్చట నేయుండు లాగునఁ జెప్పితిని. అంత వారిలో నొక్కండు నిద్రించెను. మేల్కాంచియున్న వానికి మృషాంజన మొక్కఁడిచ్చితిని దానిమహిమచే నెచ్చట నెట్టిస్థితియున్నఁ గనుఁగొన వీలగునంటిని. అయ్యది క్షీరాన్నము భుజించి యాపల ధరించిననే కాని సఫలము గాదంటిని. దాన నాతఁడు విశ్వసించి నను విడిచిపుచ్చెను.

వృద్ధ:—తల్లి ! నేమండ నేమి మునిఁగెనని తలఁచి యీలాగున సాహసించితివి ?

సరో:-ఆనాఁటి సాయంసమయమున నొక రాజభటుఁడు నాయింటిచుట్టుం దిరుగుచు నచ్చటచ్చట గోడలు గొందులు పరికించుచుండెను. ఇదిగాంచిననేను బాదుషా యెద్దియోకుట్ర నలుప నున్నవాఁడనితలఁచి యిట్టిసాహసమున కుపక్రమించితిని.

వృద్ధ:—సరి. తర్వాతియుదంతముం దెల్పుము.

సరో:-నేనాలాగునేఁగుచుండ నీయూరి బందులనుండు నడవి నిర్యోర రాజభటులఁ గాంచితిని. వారునా చెంతకువచ్చుటకు మున్నొక కృష్ణసర్పము నాచేఁ ద్రొక్కఁబడి 'బుస్సు, బుస్సు' మనుచు నాపైఁ గాటువైవనుంకింప మెలఁకువ నద్దాని ఫణము నొడ్డఁబట్టుకొంటిని. ఇదిగాంచిన వారిద్దఱాశ్చర్యపడిరి. వారిలో నొక్కఁడు నాచేతనున్న సర్పమును దనఖడ్గమునకు బలియొనర్చెను. వారింజూచినమాత్రాన భీతిచెంగి వాలు పడంత నేలపైఁబడితిని. ఆసర్పహంత నాకుఁ బామువిసము తలకెక్కెనని తలఁచి మందువేరు దేవ నెటకో యేఁగెను. తక్కినవాఁడితఁడే యుదనని నన్నెత్తుకొనిపోవఁ బ్రయత్నించి నావైపునవంగెను. నే నీసందు గని కడువలిగి వాని నాకాలితో నొక్కతాఁపు దాఁచితిని. వాఁడా పెట్టునకే తాళఁజాలక నేలఁగూలెను.

వృద్ధ:—నీవా రాజభటునిఁజంపినది! ఔరా! వీరవనిత వన్న నీవేయగుదువు? ఆవలియుదంతముం దెల్పుము.

సరో:—ఇంకనటనుంట సరిగాదనితలంచి పట్టణమునకు రామరలితిని. మనసు కలఁతవాఱి యుండుటచే నేనెటుం బోవునది యెఱుఁగకుంటిని ఆతఱుణమున నెవఁడో వెను వైపుననుండి వచ్చి చప్పున నాచేతుల వెనుకకు మరలించి కట్టఁదొడఁగెను. నే నదరిపడి వెనుకకుఁ దిరిగి చూచునంతలో నాకరయుగము గట్టఁబడియెను. నాశక్తి కొలఁది నా బంధనము వలన విడివడఁజూచితిని గాని యది యసాధ్యమాయెను. అంతఁగోపాకుల నగుచు వానిం జూచి; "ఓరీ! పందవై వెను వైపుననుండి వచ్చి పరాయత్తచిత్తయగు నొక యబలంగట్టుట యొక్క పౌరుషమా? ఇప్పటికైన నీబంధముల వీడ్చి యెదుటనిలిచినచో నాపిడికిటిపోటు చవి చూడవచ్చును. బలిమి గలవాఁడవే నట్లొనర్చుము. దొంగవలె నిట్టికార్యము గావించి సిగ్గులేక నిలిచియున్నవాఁడవుగా!" యని యాడితిని.

పృథ్వీ:—భళీ! ఏమినీధైర్యము! అట్టి సమయమునం గూడ ధైర్యము వదలకుండుట మిక్కిలి ప్రశంసనీయము. ఆవల నేమిజరిగెను?

సరో:—ఆర్యా! ఎంతనిందించియు వాఁడునామాటల సరకుసేయలేదు. తిన్నఁగ నాచెంతకువచ్చి "నా జలికానిం జంపిన నేరమునకై నిన్నుఁ బాదుషాగారియొద్దకుఁ గొంపోయెదను. ఆట నీకు మరణదండన గలుగఁగలదు. నీవు నన్నుఁ బరిణయమాడ నంగీకరించితేని నీకీయిక్కట్టు దొలఁగఁగలదు" అని చెప్పెను.

వీర:—ఏమి యీనీచునిగర్వము! రాజపుత్త్రికన్యయని యెఱుఁగక యట్లాడెనుగా!

సరో:- అంత నేనిలాగునఁజింతించితిని "ఆపదలు రాఁగల వ్వుడు రాకతక్కవు దానికి వెరవాలోచింపకయుంటయుచితము గాదు. ఏదేనొక యుక్తి చేసియిప్పటికిప్పుడప్పించుకొనిననావలి మాటచూచుకొందము." అని తలఁచి వానింగాంచి; "ఓయీ నినుఁగాంచినది మొదలు నామానసమెట్లోయున్నది. అయినను నాకొక నెలదినములు నాచరింపవలసిన వ్రత మొండు గలదు. అంతదాఁకఁ గొంత యోరుచుకొనుము. ఆవలనీవు స్వస్థుఁడ వగునట్లు జేయుదును. అప్పుడు నీవు దివ్యసుఖము లనుభవింపఁగలవు"

పీ:—ఏమి యీశ్లేషోక్తులు! ఇట్టి వాక్పటిమగలనీచే కాముకుఁడగు వాఁడు వంచితుఁడగుట యొకవింత యా?

సరో:—అంత నాభటుఁడాపరకుఁ దనయింటనుండ వలయుననియాడెను. కాదనినచిక్కులాభమేమని యాలోచించి యట్లే యని యంగీకరించుకొంటిని. ఆవలవాఁడు నాకట్లను విప్పివస్సాం దనయింటికిఁ దోడ్కొని చనెను.

వృథ్వీ:—ఎంత సాహసమాచరించితివి !

సరో:—స్వామీ! ఈ సేవకురాలిమాట లాలకింపుఁడు. అట్టితఱుణమున సాహసము లేకున్నఁగార్యహానియగుఁగాదె! ఇదిమీ రెఱుఁగనిది గాదు. నేఁగొంత మోటుదనము చూపిన వాఁడునిశితకరవాలమున నాశిరముఖండించిన నే నేమగుదును జీవించి యుండుటచేగదా యీవిపత్తును దాఁటఁగల్గితిని! "బ్రదికియుండిన సుఖములఁ బడయవచ్చు" ననుట మీరు దఱుచు వచించు చుండినది యేకదా?

పృథ్వీ:—బిడ్డా! సంతసించితిని నీసమయోచిత బుద్ధికి. అవలి యుదంతమే నెఱిఁగినది యేయగును.

సరో.—ఏలాకెయుఁగవడి యుండియు నపేక్షించుటపాడి యగునే?

పృథ్వీ:—నీవటువానికిఁ జిక్కుటగాని చెఱఁబడుటగాని నేనెఱుఁగను. జావజీగారి ప్రథమభటుని సకుటుంబముగా సుల్తానుగారు చెఱఁబట్టుమనినది నేనెఱిఁగినయంశమే. నీ వాతని యింటి కరిగినందున వానితోఁ జెఱఁబట్టఁబడి యుందువని యిప్పుడు నేనెఱింగితిని. పాదుషాగారు మఱునాఁడే యూరికి వెడలియుండుటచే వారికి నీవు చెఱఁబడుట తెలిసియుండదని తలఁచెదను.

సరో:—తన్ను వివాహమాడినచోఁ జెఱనుండి వెలువడి సర్వసుఖము లనుభవింప వచ్చునని నేబంధితయయిన నాఁడే యాతఁడునాకు వార్తఁ బంపియుండ నాతనికిఁ దెలియదని యెట్లుచెప్పవచ్చును?

పృథ్వీ:—నీవచ్చోట నుండుట నాతని కెట్లు తెలిసియుండును?

పీర:—ఆగ్రాకోటకావలితో నాభటులు మాటలాడుచుండఁగ నేవినియుంటిని. చక్రవర్తియానతియయి యామెను బలాత్కారముగాఁ దనయింటికిఁ గొనిరావలయునని వారి కానతిచ్చెనఁట. వానిలో నొక్కని శపథముగాఁ బంపుటచేఁ దక్కినవాని కార్యము నెఱవేర్చిన వానిఁగా నూహించి యుందును, తనయానతి చొప్పున నీమందుఁ గొనవచ్చి యీబిడ రూపముచూచి ముగ్ధుఁడై

తనయింట నునిచికొనియుండునని యూహించియుండఁబోవును. కాఁబట్టి యిట్టివార్తం బంపియుండును.

పృథ్వీ:—తన్నుఁగోరుకున్న బంధవిముక్తి యొసర్చునన్న వాఁడు మరలనెట్లుగడిచెను? తానూరకేగవు డేరివి జెప్పనిడఁ గూడదనియేల యాజ్ఞాపించియుండును? ఈవీరసింగు చెప్పఁబడి యుండుట యీవీరభటునకెట్లు తెలిసెను? ఇది యంతయు వింతగాఁ దోఁచుచున్నది. సలుకడవిగాఁ దఁగాని నిశ్చయము తెలియఁగవలను పడదు. సరోజినీ! నీవు గాన్పించకమికి విశ్వాసుఁడనైన రాణాగారి కీయుదంతము దెల్పుచు నొకలేఖ వ్రాసియుంటిని. అది యూరాలా గున నుండవినిమ్ము. వీరసింగు! రాణిగారిచ్చిన లేఖ నిట్టిమ్ము.

అని వీరసింగుచేతి లేఖనందుకొని తానిట్లని చదువఁదొడఁగెను,

చితోడు.

డిల్లీపురమునందు పృథ్వీరాయలగారికి,

మీరు సప్రేమముగ నంపిన లేఖయందలి సంగతులు విశదపడెను. సరోజిని కిటవచ్చుట కిష్టమున్న యెడలఁ దగిన సహాయము సేయ మే మన్నివిధముల సంసిద్ధులము. ఆబిడ మేనమామ యగు కాలభాను నాబిడం దోడ్కొని రా ననువఁగలము మీరాబదులున కెదురు చూచుచున్నారము.

ఇట్లు,

రాణాగారి యాస్థానము.

ఈజాబు చదివిన వెంటనే వీరసింగు పృథ్వీరాయలవా రాలోకించి;

వీర:—ఆహా ! బాలభానుని సౌందర్యము వర్ణింపనలవి గాదు. నిర్గంధకుసుమమట్లు కేవలరూపము గాక విద్యానైపుణ్యము వర్ణనాతీతము. విద్యారూపములకును రూపములకు గాంభీర్యాది గుణములు వాచామగోచరములు. అట్టి చుట్టమొక్కఁడుండుట యాబిడ యదృష్టమే యని తలంచుచున్నాను. చితోడున కరుగుట క్షేమ మని యంగీకరించినచో నేనే మరల సందేశహారుండ నయ్యెదను.

అంత సరోజిని యించుక లజ్జ యుదయింప నది బైలు పడనీకుండ నాకారగోపనము గావించెను. రాణిగారి లేఖకుత్తరము దానే వ్రాసి వీరసింగుని చేతికిచ్చెను. అంతట బ్రొద్దుపోవుటచే నెల్లరు వారివారికై యమర్చియుండిన శయనముల కరిగి విహరించిరి.

---

పదునొకండవ ప్రకరణము.

## రాణాగారియాస్థానము.

పద్మాకరమువలెఁ బద్మాలయాసద్మమై తనరు చితోడు దుర్గమైదాన మొకనాఁటి యుదయమున రథగజతురగపదాతులను చతురంగబలములుఁ గల్గి విలాసపురుషుల విహారస్థానమా యన నొప్పుచుండెను. ఒక్కెడ తెక్కకుముక్కుటములగు గుఱ్ఱపు గిట్టల తాఁకున దుమ్మురేగి మిన్ను మన్ను నొక్కటిగఁ జేసి కన్నులఁగప్పుచుండెను. యుద్ధవీరుల సింహనాదములు నలు

దెసలం బర్వెమాలు మ్రోగుచుండెను. ఆ సైనిక నికాయము సముద్రములో, బోర వరుగు నపర మహాసముద్రమో యను లాగుననుండెను. కరీభాంకారములు ప్రళయకాల మేఘముల యులుకుల ననుకరించుచుండెను. ఆసేనలరంగును సేనాపతుల హంగును వర్ణింపనేరికి నలవిగాదు.

అతరుణమున కోటనుండిమరలిన రాణాగారూరు సేరిరి. వారిదిగని యాతురముగ నటంగల వాహినీపతుల విచారించిరి. వారు "రాణిగారి యుత్తరువు మేరకాయుత్తము సేసితి" మని బదులొసిరి. రాణాగారంత వింతపడి యంతిపురము నకు వచ్చిరి. అట వీరాబాయింగానక సభాభవనమునకు విచ్చేసిరి.

అందుగ్రకోపాయత్త నేత్రయగు నామెంగాంచి:

ఉదయ:—ప్రియా ! ఏమియీ వీరావేశము !

వీరా:—నాథా! వీకోత్తంసులగు మీబోంట్లకుండక్క నబలయగు నాకేటివీరావేశము !

ఉదయ:—ఉదయ సింహుని పత్నివై ప్రతాప సింహుని తల్లివై వీరపత్నివనియు వీరమాతవనియు వాసిగాంచిన నీకుం బరాక్రమమున నొకలోటుగలదే! అదుసింగమయయ్యె నేనుంగు మోము చూచిన నూరకుండంగలదా?— అదియటుండ నిమ్ము. ఇట్లేల యుద్ధసన్నద్ధవైతివి ?

వీరా:— ఈయుత్తరముచూచిన మీకెల్లం దెలియును

ఉదయ:—ఉత్తరమా? అదియెచ్చటినుండి వచ్చినది?

మీరా:—దీనిం జిత్తగింపుఁడు. అంతయుఁ దేటపడఁగలదు.

అంతనుదయసింహుఁడా మొదలి లేఖనందుకొనెను. ఆతురముతోడ దానిఁజదువుకొనెను. విషాదగ్రస్తుఁడై యించుక సేపేమియుఁ దెలియక స్తబ్ధుఁడాయెను. మరలఁ దెప్పిఱిలి;

ఉదయ:—పాదుషాకు నిట్టి బుద్ధి యుదయించెనుగా! ఔరా! ఏమియీ కాలమహిమ! సరి. ఇందు మన మేమి సేయుట?

మీరా:—చేయవలసినది కొంత యింతకుమున్నే యీ దాసురాలాచరించెను. శేషము దేవరపాలఁ బడియున్నది.

ఉదయ:—నీ వేమి సేసితివి? నాపాలఁబడియుండున దేది?

మీరా:—"ఇట్టి చేఁత భవాదృశులకుం దగునదికా" దని యొక లేఖం బంపితిని.

ఉదయ:—చెలి! అందుకొఱకే సహజముగు నవసరమా టొనర్చితివి. సరి. ఇంకఁ గడచినదానికై వగచుట నిష్ప్రయోజనము. అవల నేమి జరిగెను? పాదుషా యా లేఖ గ్రహింపకుండెనా?

మీరా:—పాదుషా యా లేఖావమానిని మూలముసఁ జూచి యాగ్రహమునకు నప్పుడున్నటుల మనకు వర్తమాన మంపెను.

ఉదయ:—ఆహా! విమర్శింప నెంతటి సాహసమున కుద్రేకించితివి? నాటిరాజు లాతని యాశ్రితమిత్రులై యుండ మనము స్వతంత్రులమై యున్నవార మను కీర్తిం గడించి యున్నారము. అయ్యది చాలదే? చక్రవర్తితో నకారణవైర మూని మనము కయ్యమునకుఁ గాలుద్రవ్వుట దగవా?

వీరా:—ఇందు మన మాతనియామవతిని మీఱుట లేదు. తన్నెదిరింపసంసిద్ధులై యుండవలయుననికదా యాతని యాజ్ఞ.

ఉదయ:—తనబలము నెదిరిబలము నాలోచింపవలదా? ఊరక తొందరపాటు యుక్తమగునా? అనాథయువతీ రక్షణము సేయఁదలఁచి స్వనాశము గావించుకొనుట యయుక్తమగును. తొలియుపాయముల మూఁడింటఁ గార్య మనుకూలింప కున్న నపుడుకదా యంత్యోపాయ మాచరింపవలయును?

వీరా:—నాయుత్తర మట్టిదయగును. ప్రాణరక్షణార్థము మన మీకార్యమున కుపక్రమించితి మంతియ కాని క్రొవ్వి యొరులపై దాడివెడలుట లేదు.

ఉదయ:—ఇంక మన మీవిషయమున వాదులాడుట కంటె మంత్రులతో నాలోచింతము. ఎంతటి బలవంతులైన నమాత్యుల నాలోచనము చొప్పున నడుచుకొనకుండిన బాగుపడఁజాలరు. రాజసభకు మంత్రులు ప్రాణము వంటివారు. రాష్ట్రముయొక్క క్షేమము నారయుటలో రాజుకంటె మంత్రులే మిన్నలగుదురు—మంత్రులారా! నెత్తురు వెల్లువలు పాఱ సైన్యము నశింపఁ జూచుటకు మీరంగీకరింపరని నేఁ దలఁతును. ఇప్పట్టున సంధి చేసికొనుట సర్వవిధముల శ్రేయోదాయకము, మీయభిమత మగునని నాకుఁ దోఁచెడిని.

మంత్రులు:—దేవా! చక్రవర్తిగయ్యామునకు వచ్చుట మన యుత్తరముం జూచి యాగ్రహము వహించుటచేఁగాదు. మన యైశ్వర్యముం జూచి యసూయాపరుఁడై యీరాజ్య మున

హరింపఁదలఁచి వేచియున్నవాఁడు గావుననే యీ నెపముగల్పించుకొనియెను. కాకున్న నాతఁడు యింతటి యాగ్రహమూనఁగఁ జాలునదిగాదు. రాజ్యము దారవోసి యడవుల పాలగుట తక్క నింకెట్టి సంధియు నాతనితో మనకుఁ గుదురఁజాలదు.

ఉదయు:—మీరెంత చెప్పినను నాతనితోడి యుద్ధము మన కనుకూలపరిణామి యగునని తోఁచుటలేదు.

మంత్రులు:—దేవా! దేవర సైన్యమునకిది స్థానముగుటచే నిచ్చటి రహస్యస్థలాదులు దెలిసియున్నవి. దాననిది నిశ్శంకముగాఁ బోరఁగలదు. వారిసేనలు నూతనస్థలమగుట ధైర్యముతోఁ బోరఁజాలవు. స్థానబలమొకటికంటె మిన్నయగుఁగదా !

ఉదయు:—సేనాపతీ ! మంత్రులకేమి ? వారెంతైనఁ జెప్పఁగలరు? పోరున నరులనెట్టి ఘోర యుద్ధము సలుప వలసినవాఁడవు నీవు గదా? దాన నీయిష్టము దెలుపుము.

ఈమాటలు విని సేనాపతియగు వట్టాయను వాఁడేమియో చెప్పఁబోవుచుండ నాతని నాఁపి బేదనూరు జయమల్లుఁ డిట్లనెను.

జయమల్లుఁడు;—దేవా ! దేవర వంశాదికర్తయగు బాప్పారావలనేకలక్షల సైన్యములఁ దునుమాడి గజ్నీరాజగు సేలిమ్మను వాని నోడించి వాని తనూజాతిం గైకొనియెను. అతని వెనుకటివాఁడగు ఖుమానుఁ డిరువది నాల్గుతడవ లరులతోఁ బోరి వారినోడించెను. మఱియు మీపూర్వుఁడగు సమర

సింహుని భార్యాకరుణా దేవి మాండుఁడయ్యయ్యసంభోరునొద్ద మహమ్మదీయ సేనాపతియగు కుతుబుద్దీను నోడించెను. లక్ష్మణసింహుని కాలమున బద్మినీ దేవిం గోరిన యల్లా ఉద్దీను రాజపుత్రులు యుక్తిని జయించిరి. హమ్మీరను వాఁడు ఖిల్జీయను డిల్లీశ్వరుని చంబళా నదీయొడ్డునఁగల సింగోళీయను గ్రామమున నోడించి చెఱఁబట్టి మూఁడు నెలలు బందిగా నుంచుకొనియుండెను. పిమ్మట డిల్లీశ్వరుఁ డజ్మీరు, రణథంభోరు, నాగోరు, సుయీసోపూరను నను ప్రాంతములు: నేఁబదిలక్షల రూప్యములు, నూఱు గుఱ్ఱములు నిచ్చుటయే కాక మన రాజ్యముపై నెప్పుడును దాడి వెడలిరాక యుండునట్లు నెవ్వరే నితరులు పోరికి వచ్చినచోఁ దాను మనకు సాయపడు లాగున వచించియు నాము వ్వొదప్పించు కొనియెను. మోకల్ రాణా డిల్లీసుల్తానగు ఫిరోజ్ షాహాను రాయపూరునొద్ద నోడించెను. కుంభరాణా గుజరాత్ దేశములోని తుర్కసుల్తానులు యుద్ధమునకు రాఁగ మాళవ దేశపుమైదానమున వారి నెదిరించి యోడించెను. మాళవ రాజగు మహమూదుం జెఱఁబట్టి చితోడుగడము మీఁద నాఱు నెలలుంచి వాఁడు మరల విధేయుఁడుగాఁగ వాని రాజ్యము వానికిచ్చెను ఇట్లు మీ పూర్వులెల్లఁ బోరసిన ముందఁజ వేయుచుండ నట్టివంశమున జనించిన మీరీలాగున భీతిలుట సరియగునా? చూడుఁడు. ఎందఱు రాజు లాతనికి దాసానుదాసులై యున్నవారు? వారి యాకారంబు జేరేని వాసిఁగాంచి యున్నదే? ఇంతవఱ కాతనికి లోఁబడకుండుటచేఁగదా మనకీర్తి జగద్విఖ్యాతి గాంచియున్నది! ఇట్టిప్రసిద్ధిని పీటఁ బుచ్చి

గొంక మహమ్మదీయునివలని భయమున సంధిచేయనొప్పుట
కేయూర నెవ్వరేని సమ్మతింపఁజాలుదురే? ఇట్టి కార్య మా
చరింతునని చెప్పుకొనిన సిగ్గులచేటగును. మేమిగాదఱముండ
మీరేఁ జంకవలయును? చిత్తోడుగడము పౌరుషహీనము గాయెనని
తలఁచితిరే? మనవారు ప్రాణహానికేని సమ్మతింతురు కాని
మానహానికిష్ట పడఁజాలరు.

వీరా:—రాజన్యచూడామణీ! మీరాలాగున నాడిన
నిమ్మ జనులెల్ల రణభీరులని తెగడరా? ప్రజలెల్లనంగీకరించినఁ
గదా మన నాయకత్వము స్థిరపడఁగలదు! పట్టముగట్టుకొను
నప్పుడు "ప్రజలయిష్టములారసి రక్షించెద" మని మీరొనఁగిన
వాగ్దానము పరిపాలింప వలదా? దానిమఱచుట భావ్య
మగునా? రాజునానతి ప్రజానుమతమైనచో వన్నెకెక్కుంగాని
యొండు విధమైన రాణింపఁ జాలదనుట మీకెఱుఁగనిది గాదు.

ఉదయ:—నీమాటలుజూడఁ జూడ నీవ వారియుద్ధమునకు
బురికొల్పిన లాగున నున్నది.

పట్టా:—వీరభూమిని జనించి వీరవరేణ్యుల సేవించు
మావారలు పురికొల్ప నేల? నీటిలోని మత్స్యముల కెవ్వరీఁత
నేర్పెదరు? శౌర్యవంతులకు రణోత్సాహము నైజమగును.

వీరా:—నాథా! నాపై నాగ్రహింపకుఁడు. మనమూరక
యుంటిమేనియు మనవారూరకుండు వారు గారు.

ఉదయ:—యుద్ధమున జయాపజయములు వ్యవస్థా
శూన్యములు. కాబట్టి నే నట్లాడవలసెను.

వీరా:—అయిన నిందల కంగీకరింప వలయుననియే నీయభిమతము గాఁబోలు!

వీరా:—నాయొక్కదాని యిష్టము గాదు. ఇచ్చటి వారలకెల్ల నిదియే యభీష్టమగును. కావున దేవర వారన్యథా నుడువక సంసిద్ధులు గండు.

ఉదయ:—మీరందఱీలాగునఁ బట్టుపట్టియుండ నేను మాత్రము గాదననేల?

అని పట్టా మొదలగు సేనానాయకులనెల్ల యుద్ధమునకాయత్తమగునట్లానతిచ్చెను. యుద్ధవీరులు గొందఱివఱకే సంసిద్ధులుగ నుండిరి. ఇట రాజపుత్రసేనలలో బేదనూరు జయమల్లుఁడు లక్ష కాల్బలము నేఁబది వేల గుఱ్ఱములు నిరువది వేల యేనుఁగులుం గల్గి పామహాసైన్యము నడిరింప నేఁగు చుండెను. పట్టాయు సాహిదాస్ బోండాయు నొక్కొక్కఁ డొక్కొక వైపునను పది వేలపదాతు లిరువది వేలతురంగములు పది వేల గజములుఁ గల్గి కోణాకృతిగఁ జనుచుండిరి. ఈలాగున ముక్కోణముగ నీసేన లమరియుండ రాణాగారంగ రక్షక యుతులైన వ్యూహమధ్యమున నరుగుచుండిరి. వెంగట నుండు మంత్రులు మొదలగువా రొకనిఁ దయైన నొరఁగఁ బెట్టుకొని కాఁపురము సేయులాగునరాజు పిఱికియైనందామీఁ గట్టుకట్టువఱకుఁ బోవక యాతనినడ్డము పెట్టుకొని కార్యము గొన సాగించుకొనఁదలఁచువారగుచు నాతనికనేకవిధముల ధైర్యము సెప్పుచుండిరి. సైన్యమున కీనడిమియొక్కరామి సంతసమునఁ జెల

రేఁగుచుండెను. వారిట్లరుగుచుండ వీరియొకవైపున నడవి దారిని వారికిసహాయముగానుండ భిల్లసైన్య మేతెంచుచుండ రాణా యది గని మంత్రులతో:

ఉదయ.— ఈయరణ్యమార్గమున వచ్చు నీసేనలెవరి వగును? ఆలసింపక మీరటకేఁగి విచారించివచ్చుట మేలగును.

మంత్రులు:— ఈవచ్చునది మన భిల్లనాయకుని సేన. మనకు సాయపడ నీలాగున వచ్చుచున్నది.

వీరిటుమాటలాడుచుండ నాసేననుండి భిల్లనాయకుఁ డరుగుదెంచి రాజునకు మ్రొక్కి ప్రక్కన నిలిచెను.

ఉదయ:— భిల్లనాయకా! నీచేసిన మేలున కెంతయు నలరినారము.

భిల్ల:— తతియెడఁగిరియొనర్చ వలయుట సేవకధర్మముగుటం దేవరచే ననాహూతుండనయ్యు నిటు వచ్చితిని. నాయెడ నట్టితప్పులున్నను మన్నింపఁగోరుచున్నాఁడను.

ఉదయ:— బాగు బాగు! మన్ననసేయుటకుమాఱు మన్నించుటయా? యుద్ధమున నీభుజబలము చూపి జయము సంపాదింపుము. అంతియచాలును.

అని యిటులాడికొనుచు నాసైన్య నికాయముతోడ వారుమందమున నడచుచుండిరి.

# పండ్రెండవ ప్రకరణము.

# నిష్క్రమణము.

భర్తృవిరహావ్యాకులయగు నిశాకాంత ధరించు మలిన వస్త్రమో యనఁ దనరుచు, ద్వారవతిమాడ్కిఁ గృష్ణమయమగుచుఁ, జోరాదుల కదృశ్యకరిణీ మహామంత్రము భంగి నొప్పుచుండు నంధకారము నిజనామమునకు సార్థక్య మొదవఁ జేయుచు నల్గడల విజృంభించుచుండెను. దివాంధముల కాతరుణము దివాకాలమురీతి నానందదాయక మగుచుండెను.

అంధకార బంధురమగు నా నిశాసమయమున నిర్వురాశ్వికులు ఢిల్లీనగరమునఁగల యొకసందు వారిం బట్టి పోవుచుండిరి. వారిలో మొదటివాఁడు తెల్లనిమేనిచాయ గలిగి కోమలగాత్రుఁడై యలరుచుండెను. రెండవవాఁడు చామనిచాయఁ గలిగి యతికృశగాత్రుఁడైయుండెను. అట్లరుగుచుండు నా గుఱ్ఱపురౌతు లిద్దఱీవిధముగ సంభాషించుచుండిరి.

రెండవ:—యోధాగ్రణీ! కొత్వాలు మున్నగువారు గుట్రసేయుచున్నారనుట నీకెట్లు తెలిసెను?

మొదటి:—అయ్యా! నేనొకనాఁడీవీధి నేఁగుచుండ నొక కారణమున నాత్మరక్షణము గావించుకొనవలసెను. అప్పుడు చెంగటఁగల యొకయుపవనిం బ్రవేశించితిని. నాయాపద దీఱు వఱకుం దల దాఁచుకొనందగు నెల వారయుచుంటిని. అటఁ గల యొకపుట్టచాటున కేఁగితిని. ఆప్రదేశమున గంపవుం

జెక్కులచే నిర్మితమగు నొకగోరి గన్పట్టెను. దానిమాటున దాఁగ నరిగితిని.

రెండవ:—మిత్రమా! నీకొదవిన యాపదయెట్టిది ?

మొదటి:—నేనద్దాని నిటఁ దెలుపఁ జాలను. కావున నన్ను మన్నించి యాప్రశ్నము మానుకొనుఁడు.

రెండవ:—సరి. నీయిష్టమునకు నేనేల భంగ మొనర్ప వలయును? అవలియుదంతమైనం దెల్పుము.

మొదటి:—అట్లు నేనాగోరిని సమీపింపఁగ నందొక వెండిపిడి గానుపించెను. తాఁకుటయుతడవుగ నయ్యదియిరుపాయ లయ్యెను. అటనుండి క్రిందికిం దిగ ననువగునట్లు సోపానపంక్తి యొండు గన్పట్టెను. నానిక్కంపురూపున నటఁజొచ్చుట సరి గాదనితలఁచితిని. తత్క్షణము నాయొద్ద గుప్తముగ నుండు నొక కాషాయకంచుకముం దాల్చితిని. మాయజడలు ధరించితిని. అవలనామెట్లదారిం దిగిపోవుచుంటిని అలాగునఁ గొంతదూరము పోవునప్పటికి మాటలసడి వినవచ్చుచున్నను నల్లనఁ గ్రిందికిదిగితిని. అట నొకలతా భవనమునఁ గొత్వాలు నబ్బుల్లాఖాను మున్నగువారు మాటలాడుచుండుట గంటిని. దాపునఁగల వట్టిచాటునదాఁగి వారిమాటలెల్ల నాలకించితిని. అచ్చటి వారి సంభాషణమంతయుఁ జక్రవర్తి హిందూమతాభిమాని యగుట నాతని నాశము గావింపవలయుననుటయే. నాటఁగోలె వారితోడ మైత్రినల్పితిని. దాన నాకీయుదంత మెఱుకపడెను.

రెండవ:—మిత్రమా! కోత్వాలునంతవానిం గూడ వంచించి యామె యేఁగుట కెవ్వరితోడ్పా టుండియుండునో నీకుఁ దెలియునా!

మొదటి:—అతఁ డీశుఁడనియు నిచ్చటనున్నాఁడనియు నేనెట్లు చెప్పఁగలను!

రెండవ:—ఆమెను నేఁజూచునంతవఱకు నీమాటల విశ్వసింపఁజాలను!

మొదటి:—పాదుషాగారి యాజ్ఞయగు నంత దనుక యీరాకుజోలికిఁ బోవకుండునెడల నేనిప్పుడే యామెంజూపఁగలను. అయిన మనమీనేనమతోడ నచ్చటికి వెడలుటయే యుక్తము.

రెండవ:—నేనామె యెడల నట్టిజోక్యముం గల్గించు కొనను. కావున నీవాసంశయము మానుము. మనమిచ్చట మాఱు వేసమూనుట కెట్లు వీలగును?

మొదటి:—అందుకుం దగు విధానములెల్ల గూర్చె సజ్జీకృతములాయెను. కావలసినంత సమయము లేదు. మీ వాగ్దాన మొక్కటియే నేనడుగుచుంటిని. అదియుఁ బ్రాప్తియాయెను. ఇంక మనము నిర్భయముగాఁ బోవచ్చును లెండు.

అని యీలాగున మాటలాడుచు నాయాశ్వికద్వయ మాసందు దారిం దాఁటి తిన్నఁగా రాజమార్గమునం బడిపోవుచుండెను. కొంతసేపాదారి నేఁగి యొకయింటిని సమీపించిరి. అది యొకసత్రము. కావున యాత్రాయాత్రజనముల సందడి యెక్కుడుగా నుండెను. మన యాశ్వికులా సత్రము వాకిటఁ

దము గుఱ్ఱములనుండిదిగి యాహయముల నచ్చటి లాయమునఁ గట్టి లోనఁజొచ్చిరి కాని మరల వారు బైలువడలేదు.

వీరీలాగున లోనికేఁగినపిమ్మటఁ గొంతవడికిర్వురు కుగ్రామ వాసులా సత్రమునుండి వెలువడిరి. వారచ్చటనుండియుత్తరాభి ముఖులైయొక సందుదారి నేఁగిరి. ఆసందు చివరనుండునొక యింటి ని జేరి యావాకిటఁ బిలిచిరి. ఆయిల్లు ప్రాఁతదగుటచేఁ గొంత శిథిల ముగనుండెను. వారాయింటి కవాటములు లోన బంధింపఁబడి యుండమి నదు జొచ్చిరి. ఇల్లు ప్రాఁతదియైనను దుమ్ము మొదలగునవి లేకుండులాగునఁ శుభ్రముగఁ జిమ్మి ముగ్గులిడియలం కరించియుండుటచే నాఁడిన్నయింట లక్ష్మీతాండవమాడు చుండెను. ఎదుటనొక వేదిక దానిపైనొక దీప స్తంభము. అందలి దీపకాంతిచే నాయింటికంతయు శోభనొసఁగుచుండెను. అట నొక యువిదయు నొక వంటలక్కయునుండిరి. ఆవంటకత్తెయు యాయువతిపట్టి నటుపప్పులాగునఁ వంటచేయుటమాత్రమ కాక యింటిపను లెల్లం జక్కఁబెట్టుకొని పోవుచుండెను. ఆయువతి కన్నిటికిని జిన్నతనమునుండియు నిట్టి నిర్బంధములు లేకుండుటచే నాటపాటల వినోదముగఁ గాలక్షేపము సేయు చుండెను. వ్యసనమనుమాటయెట్టిదైన నెఱుఁగని యాయంగన కెప్పుడేగోర్కో మోమువంచుక వాడువాఱి యుండెను. శరీరము శుష్కించియుండెను. ఒంటిబసలేక యెత్తుకుండెను. ఆకలిదప్పులఁ దాళలేనట్లుండెంచుక యన్నపానీయములం గ్రహించుటయు కాని యందావలయు నభిరుచి లేకుండెను. తోడిబాలికల యిండ్లవేడుకలకుఁ బోనొల్ల దయ్యెను. ఆకామముల వై

కల్లెటూరివారు:—అవ్వా! నీయీ యుపచారముల కేమెంతయు సంతసించితిమి. ఇయ్యది మాయూపిరియుండు వఱకు మఱువఁజాలము.

ముదుసలి:—అయ్యలారా! మీరు గొనియాడఁదగినంత యుపకృతి నేనేమియుఁ జేయలేదు.

అని లోనికిఁ బోయి యట నుండు యువతింజూచి;

ముదుసలి:—మన యింటికిఁ గ్రొత్తవారిద్దరు వత్తురని నిన్న కవచయోగి వచించినది వాస్తవమయ్యెను.

యువతి:—కవచయోగి యిప్పుడు జ్ఞప్తికి వచ్చెను. ఎట్టి దయామయుఁడా యోగిచంద్రుఁడు! ఆహా! అతని యవ్యాజప్రేమ నేమని కొనియాడఁగలము?

అని యాముదుసలితో నాయువతి పథికుల యొద్దకు వచ్చెను. ఆయువతి యందమున నాయాగంతుకులలో నొకరుఁడు అతివిస్మితుఁడాయెను. యువతి యాగంతుకులఁ గాంచెను. వారిలో నొక్కరుఁడు సుమారు పదునాఱేఁడుల ప్రాయము వాఁడుగ నుండెను. వేఱొకఁడు ముప్పదియైదేఁడుల వాఁడుగఁ దోఁచెను. అంత నాయువతి యాగంతుకులఁ గాంచి;

యువతి:—ఆర్యులారా! మీరిద్దరేయూరివారు? ఈ యూరికి వచ్చుటకుఁ గతమేమి? చెప్పఁదగినచో సెలవిండు.

యువకుఁడు:—అమ్మా! నీకడఁ జెప్పరాని దాఁపరికమే మున్నది! మేమింద్రపురవాసులము. నా కొడుకు పేరు జ్యోతి

శాస్త్ర పారంగతులు. నేను వీరిశిష్యుఁడను. బీదలము గానఁ జక్రవర్తిగారి యాశ్రయముఁగోరి వచ్చియున్నారము.

యువతి:—అయ్యా! మీకచ్చట రాజులెవ్వరుం జిక్కకుండిరే! ఈచక్రవర్తియాడంబరములు విని మీరువంచితులైతిరని తలఁచెదను. ఇంతకు దూరపుఁగొండలు నునుపుగఁ దోఁచుట నైజముకాదా?

యువకుఁడు:—తల్లీ! నీవీలీలం బలుకఁదగదు. వదాన్యతిలకుఁడని వాసిగాంచిన యీశ్వరచక్రవర్తినా యిట్లనెదవు? నిందకేమిం బాత్రాపాత్రవిచారము వలదా ?

యువతి:—మీరలన్యదేశస్థులరు. మీకాతనిగుణములు దెలియవు. వానిమాటలకు మోసపోవకుఁడు. వంచకశిఖామణి యగువీఁడు వంచకమునకన్న మిన్న యగువాఁడు.

రెండవ:—నీమాటలు మాకు నచ్చుటలేదు. నీవు దక్క నింకెవరు నామహాపురుషు దూషించుచుండుట లేదు.

యువతి:—దారిద్ర్యము మిమ్ము బాధించుచున్నది, కావున మీరు యుక్తాయుక్తముల విచారింపకున్నారు. చక్కఁగ బరికించినచో మీకది విశదముగాఁగలదు.

ముదుసలి:—బిడ్డా! అది యట్లుండనిమ్ము. వీరుజ్యోతిశ్శాస్త్రము దెలిసినవారఁట. వీరివలన నీకష్టము లెప్పటికేనిం గట్టెక్కనేర్చునఁట దెలిసికొనవలయును.

యువకుఁడు:-ప్రశ్నభాగమునందే కాక సాముద్రికమునం గూడ వీరికి ప్రభావము మెండు. మంత్రశాస్త్రమున మంచి పరిచయము గలదు. ఆయుర్వేదమున నఖండపాండిత్యము గలదు.

యువతి:—ఎంతవిద్యయుండియు నేమియుపయోగము?

యువకుఁడు:—అమ్మాయీ! అట్లు పలుకకుమీ?

యువతి:—నేఁటివఱకొక్కఁడేని వీరిని సత్కరించిన వాఁడు లేఁడుకదా!

యువకుఁడు:—అనేకసంస్థానముల వీరు సన్మానముల వడసి యున్నవారు. అయోధ్యాపురపు నవాబొసఁగిన యాభరణము లింతయని లెక్కిడ ననువుగాదు. రాజపుత్రస్థానము నందలి రాజులొక్కొక్కరు వీరి నానావిధముల సత్కరించిరి.

యువతి:—అట్టివారింతదూరము వచ్చి యీయధమా శ్రమ మేలకోరిరి?

యువకుఁడు:—ఇది యధమాశ్రమము గాదు. మహదాశ్రయమే యగును. ఇప్పుడొక చిల్లిగవ్వయైన లేకుండుటచేతనే యింతదూరదేశము రావలసెను.

యువతి:—వీరార్జించినదెల్ల నిప్పటికేఁదరలెను?

యువకుఁడు:—అమ్మా! లక్ష్మీసరస్వతు లిద్దఱత్త గోడండ్రగుటచే వారికెప్పుడు విరోధము సాజము. కావున విద్యావంతుల కెంతయైశ్వర్యమువచ్చిన నప్పటికప్పుడే మాయ మగుచుండును. చంచలస్వభావయగు నాలక్ష్మి వీరిని వంచన చేసినను నాబిడ్డ జ్యేష్ఠసోదరి వీరియెడ ననుగ్రహము గల్గి యుండును. ఎట్టిరాజాశ్రయమును గల్గియు నెట్టిప్రఖ్యాతిగడించియు విద్వాంసుఁడు నిత్యదరిద్రుఁడే యగును. చోరాదులచే నపహరింపఁబడు నశ్వరమగు నీధనము నిధనమునకు మూల

మనితలంచియే శాశ్వతమై వినయాదిసద్గుణముల కాలవాల మగుచుండు. నీవిద్యారూప గుప్తధన మీశ్వరుఁ డిట్టివారి కనుగ్రహించి యుండనోవును. విస్మయాతిశయముచు కొలఁదిని దారిద్ర్యమెక్కుడగుట నిర్వివాదాంశము.

యువతి:—ఇది దెలిసియు మరల రాజాశ్రయము గోరుట సామంత్యమును వెల్లడిసేయుఁగాదె!

రెండవ:—అమ్మాయీ! నీవట్లుతలఁచుట మిక్కిలి పొరపాటు. రాజాశ్రయము నుండిన యనేకులు కనేకోత్కృష్టులం గావించిరి గాను. కవులెందరో పేరు ప్రఖ్యాతమగుట కిదియే ముఖ్యకారణము. పూర్వకాలమున నెంత వ్యాసనము గావించి లోకోపకారముసర్చిన మహాపురుషులెందఱు నరపతుల నాశ్రయింప లేదు? గుణహీనుఁడేని రాజాభిమానముం గాంచినచో నాలఁడెల్లెడ మెచ్చికోలఁ బడయఁజాలును. ఎట్టిగుణ వంతుఁడేని బహుళనందలి కువలయము వోలె రాజావలోకన శూన్యుఁడైన వికాసహీనుఁడగును.

యువతి:—మీరు సెలవిచ్చినది నామదికి నచ్చకున్నయది. రాజాశ్రయమున సుఖియింపఁదలఁచుట మృగతృష్ణాంభస్స్నానము గోరు నట్లని నామతము.

రెండవ:—బిడ్డా! లోకానుభవ శూన్యవగుటచే నీవట్లు పలుకుచున్నదానవు. రాజుల గారవమునకుఁ బాత్రులగువా రెందఱు లోకమాన్యులు గాలేదు. కాళిదాసాదికవిరత్నములు విక్రమార్కుని యన్ననలఁ బొంది జగద్విఖ్యాతులు గాలేదా?

యువతి:—ఆర్యా! విద్యావత్సపాత్రులై దృఢచిత్తులగు నా విక్రమాదు లేడ? విద్యాగంధ విహీనులై చంచల చిత్తులగు నీ రాజు లేడ? మఱియు నీ కాలమున విద్య యెవ్వనికిఁ గావలయును? ఏవియో కొన్ని యిచ్చకపు మాటలాడ నేర్చినచో నది చాలును. ఇప్పటి రాజు లట్టి వారినే యాదరించు చుందురు. ఇట్టివారు రాజులయొద్దఁ జేరి వారెట్లాడిన నట్లు తల యూఁచుచుందురు. ఆరాజు లట్టివారినే ప్రాణమిత్రులుగ భావించుచుందురు. ఈనీచులు రాజాశ్రయము గల్గినది మొదలు మహాత్ములకు రాజాశ్రయము దొరకకుండు నట్లాచరించుటయే తమ ముఖ్య విధి యని తలఁతురు. పండితుల కేరికేని రాజు సత్కారము సేయఁదలఁచిన వీరు దానిఁ బడఁగొట్టుటకుఁ బలు తెరవు లాలోచించుచుందురు. కాలము వారికి ననుకూలమగుచుండును. ఇట్టి యధములు, వీరి కాశ్రయమిచ్చిన రాజులు జనుల బాధించుటయు కాని వేఱొట్టి యుపకృతి సేయఁ బోయెదరు? కేవల మన్యాయముల నాచరించుచు నహంకార యుక్తులై యుందురు. నీచుల యహంకారమును గుఱించి చిన్ననాఁడు మాయయ్యగారీ పద్యము సెప్పిరి.

సీ॥ ఆశ్రయం బొక యింత యవలంబనంబుగాఁ
గన్నులుండియు నవి గానరావు
అధికార మొక్కింత యబ్బినంతనపూర్వ
పరిచయం బంతయు భస్మమగును
కాలంబుగడవఁగా గడుపఁగాదనకుము
న్దటిలిన దెబ్బలఁ దలఁప కుండు

ద్రవ్య మించుక చేతఁ దవిలినంత న్ప్రాఁత
దారిద్ర్య మవ్వాడ దాను మఱచు
అహహా యీ లోకమింతటి దౌర దీని
ననుసరించుట యుత్తమమగునె యెప్డు
కన్నిటికి మూలకారణ మీధరిత్రి
నగు నహంకార మద్దాని నణఁపవలయు.

ఇట్టి యహంభావము గలవారిట నెందుకొని యుండుదు మీరీ రాజాశ్రయముఁ గోరుట నాకసమ్మతి మయ్యెను.

ముసలి:—బిడ్డా! ఆ కాంతతో మన కేమిపని? ముందు మనగతి యెట్లుకానున్నదియో? వీరి జ్యోతిషము మూలమునఁ గనుఁగొందము.

యువతి—జ్యోతిషమున నాకు నమ్మకము లేదు.

యువకుడు—జ్యోతిషమున విజ్ఞానము చాలనిచో మంత్రబలమున వీరు మాయమునులఁ బడఁగొట్టఁగలరు.

యువతి—మంత్రముల నంతకుమున్నే విశ్వసించుదానంగాను.

రెండవ—నా కాయుర్వేదమునఁ బాండిత్యము గలదు, తక్కినవారివలెఁగాక నే నాధివ్యాధులను రెంటికిని జికిత్స చేయఁగలను,

యువతి:-అయ్యా! నా యాధి మీవలన నివర్తి కాఁజాలదు.

ముసలి:—సాముద్రిక శాస్త్ర పరిచయము గల్గుటచేఁ జేయి చూచియేని ఫలాఫలములం దెల్పనిమ్ము.

యువతి:—నీమాటమాత్రము గాదననేల? నీయిష్టము చొప్పుననే నడుచుకొందును.

ముదుసలి:—ఆర్యా! దీనిహస్తముఁజూచి భావిస్థితిం దెల్పుఁడు.

రెండవ:— (చేయిఁ జూచుచు) అమ్మాయీ! నిన్నొక చక్రవర్తి యపేక్షించి యున్నవాఁడు.

యువతి:—మిమ్మా విషయములనెల్లం దెలుపవలయు నని నేవేఁడుట లేదుకదా?

రెండవ:—చెప్పవచ్చినవాఁడను సాంతముగాఁ జెప్పక యుందునా? ఇంతలో నీకింత తొందర యేల? నీవ్రవొక యువకుని వరియించి యున్నదానవు. అతనికి నీపైననురాగము లేదు. మఱియు నీకొక యాపద శీఘ్రకాలమున రానున్నది. అది దైవానుగ్రహమునఁ దప్పఁ గలదు. అంత నీవొక యుత్తమ పదవిని బొందఁగలవు.

యువతిఁ డీమాట లాలకించి యించుకతడ వేమియు యాలోచించి తుదకుఁ దల యూఁచెను. యువతిమాత్రమీవచనములు విని యిట్లుతలపోయసాగెను.

"ఆమహాత్మునకు నాపైనను రాగము లేకుండుటకుఁ గారణ మేమియుండనోపును? గొప్పపదవియందలి తృష్ణయే దీనికి మూలకారణమైయుండును. పదవు లెక్కుడుగా లభించుకొలఁది నంధతయు బధిరతయుం గల్గుట లోకసహజము గాఁబోలు! గొప్పపదవి నందినవాఁడు జెట్టిచుట్టమునైన నెట్టిమిత్రునైన నెంతటియుపకారినైన మఱచుట నైజము. అట్టివాఁడు దన

తోఁటిపిట్టవి విస్మరించి యాకసమునుండి రాలి యుట్టిపడిన లాగునఁదలఁచుకొనెను. ఇంక నాకుఁగల్గఁబోవు నాపద యెట్టి దనుట దెలిసినదియే కాని యది దప్పిననుట యెట్లుసంభవము? మీఁద నేమికానున్నదో యెవ్వరెఱుంగుదురు? అప్పటికిఁ దగిన శ్రీదే గడ్డమువచ్చి నిలువరాదా? ఇంతకువెట్టి కష్టములు గల్గిననుభవించుటకునేను సిద్ధముగనున్న దానను. దానంజేసి యాపదవలన భయంపడ నవసరములేదు. నాకొక యుత్తమ పదవిగల్గునదేఁగదా? అది యెట్టిదై యుండును! అన్నిపదవుల కంటెనుత్తమమగునది స్వర్గము. కడకదియే నాకు లభించునని యభిప్రాయము గాఁబోలు!”

రెండవ:—అమ్మా! నీవేలయీలాగున నవ్యమన్న వగుచున్నదానవు?

యువతి:—పొద్దుపోవుటచే నిద్దురముబ్బున నాలాగున నున్నదానను.

యువకుఁడు:—ఈబిడపడించినలాగునఁబొద్దువిశేషము గడచినది. మనమెల్లర మిప్పుడించుక విశ్రమించుట మేలగును.

అంత నా యువతి వృద్ధవనితతోడ నా పాంథుల యుద్దసెలవుగైకొని శయనింపనరుగుచుండెను. అప్పుడాసుందరి యొక్క—కాలున నేదియో యుండవలెఁ దవిలెను. ఆమె దానినెత్తుకొని యచ్చటఁబరికింపక తనగదికేఁగెను, వృద్ధ వనిత దనకైయేర్పడియుండు శయ్యయొద్దకరిగి పడుండెను. బాటసారులా రావునఁబరుండిరి. రెండవవాఁడలయికమెండ గుటచే గాఢనిద్రాసక్తుఁడయ్యెను. యువకుఁడుమాత్రము లేచి

యడుగులచప్పుడు గాకుండులాగున నల్ల నల్లన నెవ్వటికో యరిగెను. శయనాగారమునకుఁ బోయిన యా యువతి చేతనుండు నాయుండను విప్పి చూచెను. అదియొక జాబనుటం గ్రహించెను. అంతనా లేఖ నాతురముతోఁ జూచెను. అందు ‘జ్యోతిష్క వేషమున నటకువచ్చినవాఁడు ‘ఖానఖా’ నవియు, వెంటనే పెరటిలోని యుపవనికేఁగి యటఁగల యొకమావి నీడ నాసీనయై గవాక్షము వైపునఁజూచుచుండినఁ గొన్ని వింతలు దెలియనగుననియు, నప్పుడు తానే వచ్చియామెను రక్షించెద ననియుఁగపచయోగి వ్రాసినట్లుండెను. ఇది గనిన మనయువతి యీలాగునఁ దలపోయఁ దొడఁగెను.

“కపచయోగి యీలేఖను నాకుఁ జేర్చుటకుఁ దా నెప్పుడువచ్చెను? ఆలాగునవచ్చిన నాకేల కన్పడకుండెను? ఖాన ఖానున కిచ్చట నేమియున్నది? వానితోడనుండు వేఱొకఁడెవఁడు? వీరికి నేనిటనుండుటయెట్లు తెలియఁబడెను. ఇదంతయు నాకొక యింద్ర జాలమువలెఁ గన్పడుచున్నది. ఏదియెట్లున్న నీ జాబుచొప్పున నుద్యానవనమునుండి గవాక్షమార్గమున నిచ్చటజరుగఁ బోవు నావింతల నారయవలయును.

ఆవల నొక్క నిమిసమైనఁ గూడఁ దడవుసేయక వెంటనే యామె యుపవనమున కరిగెను. వాతాయనమార్గమున నచ్చట నేమిజరుగునోయని చూచుచుండెను.

మొట్టమొదట నొక్క టాయివదుచప్పుడు వినవచ్చెను. ఆవలఁ గొంతసేపటికల్ల వాకిట ‘టింగు, టింగు’ మని యొక శబ్దము గర్ణగోచరమయ్యెను. పిదపఁ దలుపునొదలి లోగడియ

లూడిపడుచున్నను చెవిసోఁకనిపిమ్మటఁగవాటములఁదెఱచికొని యిద్దఱాయింటం బ్రవేశించిరి వారాపాదమస్తకమునల్లనియుడుపుల ధరించియుండిరి కావున వారియాకారములు కనిపెట్టవలను గాకుండెను. వచ్చినవారచ్చటఁ బరుండియున్నవాని లేపిరి. మూవురుం గలిసి యనతిదవ్వుండిన గది కరిగిరి. అచ్చటనుండి మరల వెలుపలికి వచ్చిరి. ఆయింట మూలమూలలను వెదకుచుండిరి. ఇంతలోన నేవురారక్షకభటులరుదెంచిరి. వారా మూవురనుబట్టిబంధించి తీసికొనివెళ్ళిరి. గాఢనిద్రాసక్తయగు నావంటకత్తియ కిదేమియుఁ దెలియదు.

దీపము వెలుఁగున నిదియంతయుం జూచుచుండినయా యువతి దత్త్వముం దెలియక రిచ్చపడియుండెను. అప్పుడు శరీరమంతయు నల్లనికవచము ధరించిన యొక యోగి యామె చెంగటికివచ్చి నిలిచెను. ఆయంగన యాతనిం జూచి,

యువతి:—ఆర్యా! ఈనడచిన విషయము నాకు గోచరింపకున్నవి. దయయుంచి కలరూపెఱింగింప వేఁడుదానను.

యోగి:—అమ్మా! ఇటఁ దడవుసేయుట సరి కాదు. మున్ముందు నేఁదెచ్చిన యీ యుడుపుల ధరింపుము. అందు వేసమున నుండుట యుపాయకరమని యే నివిందెచ్చితిని. మన మిప్పుడిచటఁగల యొక సొరంగముమూలమున నీయూరు దాఁటవలయును. ఆవలనీకంతయు నెఱింగింతును.

అని తాఁదెచ్చినయుడుపుల నామెకందిచ్చెను. ఆమె వానిఁ దాల్చినంతన యొక యుద్ధవీరుం బోలెనుండెను. వారట నుండి కొంతయు దవ్వుగ నరిగియటఁగలయొకసొరంగముం

దూరి కొంతదూర మేఁగిరి. దానినుండి వారు వెలువడిరి. ఆస్థలము యమునానదీతీరము. అచ్చటినుండి దక్షిణంపుదెస నరుగు కాలిబాటననుసరించి పోవుచుండిరి. అప్పుడా యోగి యామె సమీపమునకువచ్చి;

యోగి:—అమ్మా! మీయింటికి వచ్చిన పల్లెటూరి వారిలో నొక్కండు మంత్రియగుట నీకిదివఱకే తెలియును గదా? రెండవవాఁడను నేనగుదును. వాఁడు నిన్నుఁబట్ట నుద్దేశించి యున్నవాఁడని యనుమానము వడియుంటిని. కావున నేయీ లేఖ వ్రాసి సిద్ధముగ నుంచుకొనియుంటిని ఆతని జ్యోతిషము మూలమున వాని నీచాభిప్రాయము నాకు విశదమయ్యెను. అంత వాని కెఱుకపడకుండ నా చెంతనుండు నా పత్రిక నుండగాఁ జేసి విసరి వైచితిని. ఆవల వచ్చిన వారిద్దఱు రాతని భటులు. నే నిట్లగునని ముందే యూహించియుంటిని గావున వాఁడు నిద్రవోవఁగనే యీదొడ్డిత్రోవన వెలువలికివచ్చితిని. వెంటనే చెంతఁగల యూరక్షకాలయమున కరిగితిని. మీయింట దొంగలుపడిరని చెప్పి వారి నిటకుఁ బంపితిని! వారు మాఱువేసమూనియుండు వీరిం గనిపెట్టఁజాలక నిక్కమగు దొంగలే యనితలఁచి బంధించి కారాగారమున కీడ్చుకొని పోయిరి.

యువతి:—ఇట్టి యవ్యాజప్రేమంబగు మీచరిత్రము నా చెవింబడ వేయరాదె!

యోగి:—అది నీకిప్పట్టున నెఱిఁగించుట పాడిగాదు. అంతయు నిలుకడమీఁద నీకే యెఱుకఁ గాఁగలదు. ఇంతలోన నేలనీకింత తత్తర పాటని వీరిట్లు మాటలాడుకొనుచు నావారింబట్టియేఁగిరి.

## పదమూఁడవ ప్రకరణము

# పరస్పర సమ్మేళనము

చతురానన కమండలూద్భవయై, విష్ణుపాదకమల సంసర్గపవిత్రితయై, శివజటాజూట ప్రకల్పితనివాసయై యిట్లు త్రిమూర్తులతోడ సంబంధముగల్గి స్వర్గమునుండి భువికేతెంచి, పాతాళమునకరిగి నిజత్రిపథగాత్వము సార్థకముగాఁ జేయుచు, నాశ్రితాభీష్టములం దీర్చుటయె ముఖ్యధర్మమనియు సద్దానఁబడయు నామధేయమే పన్నిదెమ్మనియు ననుష్ఠానపూర్వకముగ నిరూపించుచున్నదో యన భాగీరథీ యను నామమున నలరారుచు నుమాదేవిచందమునఁ బార్వతీయగు గంగ బౌలయుగుటంజేసి హిమాలయమునందలి తాలపైఁ బడుచుజాలుచు సన్నసన్న నిధ్వానాలఁ జేయుచుండెను క్రమముగఁ బెద్దదై తృషితులగువారి శుద్ధజలములచేఁదనిపి, ఘనతరుల పాదములాశ్రయించి భగవంతుని కరుణఁ బోలె నీచోత్తమభేదము లేక యెల్లరఁ బవిత్రితులుగనొనర్చుచు నేగుచుండెను.

అట్టి జాహ్నవీతీరమునఁ నొక్క వనరాజి విరాజిల్లుచుండెను నానాసత్త్వ సమాశ్రయమగు నాయరణ్యము పెట్టివారలకు దుష్ప్రవేశ మగులాగుననుండెను. అచ్చటి క్రూరమృగము లెట్టి ధాటిగుండె గలవారికైనన భీతులఁ గావించుచుండెను. అందుఁ బెక్కురు రాజపుత్రవీరులు వేటాడుట కప్పుడప్పుడు ఏతెంచుటగలదు, అయ్యటవి నందందుఁ గొండలు కొలఁకులు

నివాసములం గల్పించుకొనియున్న వారలు. వారల కాయరణ్య మందలి క్రూరజంతువులన్న నించుకేనియు భయములే కుండును. వారచ్చటికి వచ్చు రాజపుత్త్రుల కప్పుడప్పుడు దోడ్పడుచుండెడివారు. ధనుర్విద్యయందు గడితేరినయీబోయల రాజపుత్త్రులు పెక్కుతడవలు బహూకరించుటయుంగలదు.

భిల్లపల్లియచెంతనుండు నా కాఁడవి నొక్కనాఁటి యుదయమున నొకరాజపుత్త్రవీరుఁడు ధనుర్బాణముల ధరించి నడుమున నొకబాకు చెక్కికొని తేజోవంతమగు నొక తేజీ నెక్కి మోమునఁ బరాక్రమలక్ష్మి దాండవమాడుచుండ నరుదెంచుచుండెను. చందురుఁ గేరు నెమ్మోము, నాజానులంబి బాహుకాండయుగళమును, ప్రఫుల్లరాజీవములఁ గేలిసేయునాకర్ణాంత విశాలలోచనములను, విశాలవక్షమును గలిగి చూపఱకితఁ డింద్రుఁడో చంద్రుఁడో మూర్తిమంతుఁడగు కంతుఁడో వసంతుఁడో యను సంశయము నుప్పతిలఁ జేయునటులుండెను.

అతఁడట్లావిపినమధ్యమునఁ గలసింహశార్దూలాదిక్రూర మృగములఁ గొన్నింటిఁ బొదలమాటుననుండియుఁ, గొన్నింటి నెదుటఁబడియు, గొన్నింటి వెనుదవిలియు సంహరించుచుండెను. ఇట్లాతని మృగయావిహారసందర్భమున ఘనసత్త్వము లెల్లఁ దమఘనసత్త్వములఁదొలఁగెను. అప్పటప్పటికి వాని సంఖ్య పొడవడంగుచుండెను. వాని శేషములు గొన్ని బయల్పడ వెఱచి యుండంత పొదల దాఁగి ప్రాణములఁ గాపాడుకొనఁ జొచ్చెను. ఇట్లనవ్రతపరాక్రమమున విక్రమించుచుండిన యావీరాగ్రేసరుఁడు గొంతయలసెను. స్వాదుసుగంధముపార

గోరియుండుటనే నీవలె నాబిడ కధికారిచే నెదురువాటిల నున్నట్లు నాకుఁ గర్ణగోచరమయ్యెను.

నూతనపురుషుఁడు:— మేనమామ కుమారికయని ప్రీతి పూర్వకముగ నాడుచుంటిరే? మీరేల యామెను రక్షింపఁ బూనుకొనరాదు?

యోధుఁడు:- నేనస్వతంత్రుఁడను. రాణాగారి కొలువునం దున్నవాఁడను. వారియానతి లేనిది యేమియు నెవ్వరికి స్వతంత్రము గాదుకదా! ఇంతకును ఢిల్లీపురమందున్న పృథ్వీరాయులను నాతనికి మీరాబాయిగారు లేఖ వ్రాసి పంపియున్నారు. సరోజినిని రక్షించునట్టి భార మా బిడ దనపై వైచికొనియెను.

నూతనపురుషుఁడు:— మేనయత్తకుమారుఁ డగు మీకంటె రాణియే కొంతవఱకాబిడ కాదరువగులాగున్నట్లో చెప్పిని.

యోధుఁడు:— అట్లేతలంపవలెను. కాకున్న నింతవఱకు నేనేల యాబిడం గాంచకుందును?

నూతనపురుషుఁడు:— ఎట్టివారేని నాపదనంది యున్నచో నోపినంత యుపకృతిసేయవలయుట మానవులకు విధి యగును. అట్లుండ మీ మేనమఱఁదలి కంతటి యాపద రానుండ మీ రిట్లుపేక్షించుట వీరధర్మ మగునా? ఈలాగున నున్న మిమ్మెల్లరు గతిహృదయులని దూషింతురు కదా? మిమ్మొరులు నిందింపు మాట వినినచో నాకెయేలాగున సైచును? రాణిగారి యుత్తరువుంగొని యేని మీరేల చనరాదు?

యోధుఁడు:— మా రాణి పృథ్వీ రాయులకు లేఖ పంపుటయకాక చక్రవర్తిని మందలించుచు నొకజాబుం బంపెను.

దానికిం బ్రతిఫలముగ ఘోరమగునొక పోరు గలుగనున్నది. కావున నీపట్టినసమయమున నాయట్టివానికూరు వెడలుటకు వీలుగల్గదు ఇంతకు నా మేనమామకూఁతురికి మాలిని యను నొక చెలి గలదు. ఆబిడ సరోజినిని గంటికి ఱెప్పవలెం గాచుచుండును. ఈసమయమున నాకు నా మేనమామకూఁతురి యొద్ద నుండి యుత్తర మొక్కటి నేఁడే వచ్చియుండెను. దేవిగారియాజ్ఞ గొంచువచ్చి రక్షించునట్లు నేనా కుమారునకు సరోజినికి వర్తమాన మంపితిని. ధైర్యము, సమయస్ఫూర్తి, సాహసము గలయా మాలిని యుండ నుండువఱకు నా మేనమామకూఁతురి కెట్టి యెడరుం గలుగదనియే నావిశ్వాసము.

నూతనపురుషుఁడు:-"ఊరుమున కేలయూరిలోని పెత్తన" మున్నట్లు నాకావిచారముతోఁ బనియేమి? ఈబుసుపోక యింత వఱకు సంభాషించుచుంటిని. నేనాలాఁగున నిలు వెడలినవాఁడ నింతకుమున్నే యుదయసింహమహారాజుగారి కీర్తి వినియున్న వాఁడను గాఁబట్టి వారిసాన్నిధ్యము గోరివచ్చితిని. అటనొకఁడతో స్నేహాసక్తులగు యోధాగ్రేసరులు గలరఁట. బాలభానుఁడను నొక యోధాగ్రణి నాకెల్లరలో ముత్కృష్టుఁడట. నే నాతని మైత్రింగోరియున్నాఁడను మీరావీరు నెఱిఁగియుండిన నా కింతక యామహాభాగునితోఁ బరిచయము గావింపుఁడు

యోధుఁడు:—నీకోరిన బాలభానుఁడ నేనయగుదును గాని గుణములందు మాత్రము నీవని చెప్పిన నేనంతటి యసత్యము. ఒక్కయబల పెక్కుదుముల వచ్చుచుండ దాని రక్షింపకుండు నిర్భాగ్యహృదయుఁడ నుత్కృష్టుఁడ నగుట గల్ల

నూతనపురుషుడు:—పరాధీనవృత్తులగు మీరలిం దేమిసేయఁగలరు? ఆబిడయు మిమ్మీవిషయమున దోషియని తలంపదు. ఈపాత్రమనే మీగుణములకు లోటుగలుగునా? మీరీలాగునఁగలఁచుట మీమృదుహృదయముయొక్కస్వభావము, గాని యన్యథాగాదు. అగ్నిపుటుండఁగనిండు. మీరాణాగారి నాశ్రయింపవలసినది నాయాశయము. ఆవిషయమున మీరు నాకుసత్కృతి సేయవలయునని మిమ్ము వేఁడుచున్నాఁడను.

బాలకుఁడు:—తప్పక నీకోరినయుపకారము గావింతును. నీబోటిపౌరశిఖామణు లెందఱువచ్చినను మారాణాగారి దర్శనము చెప్పక చేర్చుకొందుము. కావున నీకావిషయమున నావంతయుఁ జింతపనిలేదు.

అని యిటుమాటలాడుకొనుచు నానూతనపురుషునితోడ బాలకుఁడు చిత్తోడుగడమున కభిముఖుఁడై యేఁగెను.

## పదునాల్గవ ప్రకరణము

# దుస్స్వప్నము

ఔరా! నేనెంత దురాలోచన గల్గియుపక్రమించియు నామానహానిమూలమున నాకుటుంబముల్లడెఁగదా! ఇట నాకుఁ గుయుక్తులు నేర్పుచు, నాయొనర్చువాని నెప్పటికప్పుడు ఖానునకెఱిఁగించి నాపైఁగలుక పుట్టించెను. నేనాతనిమాయలకు లోఁబడినందునఁగదా కీలుబొమ్మవోలె నన్నాడించెను! ఇంతకుం గులగోత్రముఁ దెలియని యాటక్కరిజెంతఁ జేర్చుకొనిననా

యవివేకము యగును. తొలినుండి యాతని నెంతయు గౌరవించు చున్నందులకిది ప్రతిఫలమాయెను. శిష్టునుపేక్షించినం గొదువ గాదు కాని దుష్టుని మాత్రము దరిఁజేరనీయరాదు. వీనినా యాలోచనలకుఁ దోడువడుమని నేనేమి వేఁడుకొంటినే? తానై వచ్చి మాకెల్లం బెద్దకొండ ద్రవ్వి యిచ్చువానివలెఁ గపట నాటకము లాడి; మాగుట్టెల్లం గనుఁగొని యిట్టు సేయుటయే కాక, మాలో నంతఃకలహములు గల్పించెను. నామిత్రులం గొందఱ విడఁదీసి మంత్రికి దాసానుదాసులగునట్లొనర్చెను. ఇన్నివిధ ముల నావదలపాలు గావించెను. ఎందఱు చీలి మంత్రిపక్షమునఁ జేరిరో నేమి? మిగిలినవారి సాయమున నైన నా కార్యము పూర్తి గావించుకొనకుండునే? తలయెత్తుకొనుట కానందెనేయుఁ గాఢముల నమ్మరాదను పాఠము దీనిమూలమున నభ్యసింపఁ గలిగితిని.

ఈమంత్రికేల యిట్టి యవివేకములగునో? నాయొద్దఁ జేరి నమ్మకమ్ము పెట్టఁదలఁచిన కృతఘ్నుని దనచెంతఁ జేర్చుకొనిన దనకు నిట్టి యాపదయే కదా రాఁబోవును! చక్రవర్తిపై మా కేలయాగ్రహము కల్గవలెనను మాట యాలోచింప కున్నాఁడు కదా? కానీ సికపు మహమ్మదీయుఁడగుటనే మా కార్యమునకుఁ దోహదపడవలసియుండుట యావశ్యకము. అట్లు చేయకుండిన మానెను. ఉదాసీనుండుగ నైన నుండరాదా! విఘాతములుగూడ సలుపవలెయునే! వీఁడు పాదుషాకుం దగినమంత్రియే. కేవల స్వార్థపరుఁడై రాజుమెచ్చుకోలువడయఁదలఁచును నిట్టియకార్య మాచరించుచున్నాఁడు. పాదుషాతనపై నభిమాన ముఁగల్గి

యుండఁ జిన్నఁగా హిందువులపై ద్వేషము పుట్టించి వారిపదవు లూడఁబెఱికి మనవారల కిప్పింపవలదా? అప్పుడుకదా నీప్రజ్ఞ ప్రకాశించును! పేరుం బ్రసిద్ధమగును. కట్టా! నాలో నైకమత్యముండిన నీహిందువులయాట లింతమాత్రమైన సాగి యుండును!

అకటా! రాజనీతి విచక్షణుఁడని పేరుగాంచి, నారాలోచనపరుఁడని వాసికెక్కినయీచక్రవర్తి కిట్టిబుద్ధిపోడమనేల? విశ్వాసఘాతకులగు నీహిందువుల నీతఁడెట్లు నమ్ముచున్నాఁడు. వీరు కేవలము ధనపిశాచావిష్టులు. మనపక్షమునుండి తమవారి పైననే త్రిక్కట్టి యుద్ధము సేయుచున్నారు. మహమ్మదీయులనాఁకలువఁ బెట్టఁబోయెదరు! వీరు సమయము చూచి మారాజ్యమాక్రమింతురు. మాపూర్వులనేక కష్టములుపడి సంపాదించిన రాజ్యము వీరు హరింతురు. మారాజ్యమిట్లన్యాక్రాంతమగుటకు ముందే మేమీహిందువులఁ గూకటివ్రేళ్ళతోఁ బెఱికివేయ వలయును. లేకున్నచో హాని సంభవింపఁగలదు. శత్రుని నుపేక్ష సేయుటపాడిగాదు. ఎట్టి చిక్కులు గల్గిన నెంతటి యాపద వచ్చిన నీబొందిలో నూపిరియుండు నంతదనుక మహమ్మదీయ రాజ్యము స్థిరపఱచుట నావిధి యగును. సార్వభౌమునికి విషయము దెలియదా? చపలుఁడగుట నాహిందూసుందరుల వలలోఁ జిక్కి యిట్టి కుపోకలఁ బోవుచున్నాఁడు. వలయునన్న నెందఱు బీబీ లీతనియాజ్ఞఁదలఁ దాల్చువారలు చిక్కరు!

అది యట్లుండఁగాక. సరోజిని పలాయన మొనర్చి నందులకుఁ జక్రవర్తి నాకెట్టి శిక్షవిధించునోయని చింతిలు

నాతప్పులు బయల్పడినచో నేనేమి సేయఁగలను? ఊరక నేను సంశయించుచుంటిఁగాని గుప్తముగాఁ గావించినచో నిది యాతని కెట్లెరుక పడఁగలదు? ఒక్కొక్క కార్యమునకును శంకించు చుండినచో నేవనియుఁ గాఁజాలదు. నిత్యశంకితుఁ డెప్పట్టున నేనియు సుఖంపడఁజాలఁడు, ఇట్టి తరుణములందెల్ల ధైర్య ముతోఁ గార్యమునర్చినంగాని ఫలము గల్గఁజాలదు.

ఆహా! ఒకతప్పుగప్పిపుచ్చ నెన్నితప్పులు సేయవలసెను? మంత్రి యని దృఢముగాఁ దెలిసి యుండియుఁ దెలియని వానివలె నటింపవలసెను. జీవించియుండిన వీనివలన నెట్టికీడు గల్గునో యని వాని నిప్పుడు సంహారింప బ్రయత్నింపవలసి వచ్చెను. ఇన్నిచేసియు నాయపరాధము బయల్పడకుండునే యనిన నయ్యదియే సంశయమున నున్నది. నేనితని గుప్తముగాఁ గడతేర్చితినేనియు నామాయజడదారి యెచ్చటనో పోవఁడు? నా పాలిటి యమునివలె దాఁపరించిన యీనీచుఁడు పాదుషా కెఱిఁగింపక యుండునే? వానినే సంహారించిన నాకెట్టి కష్టములు గల్గకుండుంగాని వాఁడిప్పుడునాయొద్దకు వచ్చుటలేదు. ఎచ్చటనుండునదియుఁ దెలియకున్నది. ఈవిషయము మహమ్మదు ఖానునకు సైయదుఖానునకును నెఱింగింతును. వారి యాలోచనంగూడ గైకొని యావల నిదమిత్థమ్మని నిర్ణయింప వలెను. ఎట్లైనయుఁ బాదుషా వచ్చునంతలోఁ దగు వెర వాలోచింపకున్నఁ దప్పక చేటు వాటిలును. నేఁడేలొకో వారు రాక తడయుచున్న వారు! వీరును నాసన్న్యాసిమాయఁబడిరే! ఛీ! వారియెడల నేనిట్టి సంశయ మొందుట యుక్తముగాదు.

కొత్వాలు:-సార్వభౌమా! ఆపన్నుఁడనగు నన్నుద్ధరింపక యిట్లు నవ్వుచుండుట న్యాయమా?

అక్బరు:—ఓరీ! నేను హిందూ మహమ్మదీయుల సమాన భావమునఁ జూచుచుండ నడిదోమములు గావించి నా రాజ్యమరాజకముగఁ జేయుచుండుటలు పన్నుచు, నవి యెల్ల ధర్మయుక్తము లని తలఁచుచుంటివి కదా! ఆ ధర్మగుణములు నిన్నిప్పు డుద్ధరింపఁ జాలవా?

కొత్వాలు:—అయ్యా! నన్నిప్పుడు కావుఁడు, ఇఁక నెన్నఁడు నిట్టియకార్యమున కుపక్రమింపను.

అక్బరు:—ఇప్పటికైన సత్యము వచింతువా?

కొత్వాలు:—కలనైనం గల్లలాడువాఁడను గాను. నాపై దేవర కీసంశయము జనింపనేల? దేవా! నే నిట్టి యాతన ననుభవింపఁజాలకున్నాను. కాపాడుఁడు. మీచరణ దాసుని తప్పు మన్నింపుఁడు; ననుద్ధరింపుఁడు.

అక్బరు:—సరోజినియు మంత్రియు నేమైరి?

కొత్వాలు:—మూఁడుదినములు లాహారము లేక సుష్కించి సరోజిని సమసిపోయెను. మంత్రి యెచ్చట నుండునదియు నాకేలాగునఁ దెలియును?

అక్బరు:—ఛీ! దుష్టా! నీ వింక నసత్యము వినుపక యున్నావు. కావున నెంతెనో కాల మీకష్టము ననుభవింపవలయును. నీవు పశ్చాత్తాపము నందుదాఁక నీపై దయతలఁచుట సరిగాదు. నీకింతకంటె వేఱు దండనము పనిలేదు. ఈయాతన నీ యాచరించిన యకార్యమునకుం జాలునదగును.

అని చెప్పుచు నశ్వరకంఠధ్వానుఁడాయెను. అప్పుడాకూపమంధకార పరీతమైయుండెను. అంతలో నాకూపమునఁగాన్పింపడయ్యెను. అప్పుడాతఁడుండిన దొక్క మహాగహనమధ్యము. అందాఱు వృక్షములు నెదురుపించుచును లోతవిపైఁబడ సంసిద్ధములైయుండెను. కొత్వాలుఁడు "హా! నన్నీ బాధనుండి తప్పించి రక్షింపుఁడని యెల్లరకుం దెలియు లాగున బిగ్గరగ నఱచెను. తోడన యులికిపడుచు మేల్కాంచెను. యేమియుఁదోఁపక 'వెఱ్ఱిచూపులఁ జూచుచుండెను. గడగడ వడంకుచుండెను. మెల్లమెల్లఁ బైకి లేచి నిలుచుండెను. కంపముగలుగుటచే నిలువఁజాలక మరలనాసనముపైఁబడెను, కొంతవడికిఁ గన్నులుమూసికొనెను. తిరుగఁగన్నులు దెఱచెను. లోకమెల్లఁ గిరగిరఁ దిరుగుచున్న లాగునఁదోఁచెను. కొంతసేపటికాయన స్పృహఁగాంచెను. కొంచెముగఁ గదలఁజొచ్చెను. అంతఁ గన్నులు విప్పినప్పటి కెదుట నిద్దఱు మహమ్మదీయులుండుటఁగాంచెను. వారితోడ నేమోమాటలాడఁబోయెను. నోట మాట సరిగా రాక తడఁబడుచుండెను. కొత్వాలుని యీయవస్థఁగాంచిన మహమ్మదీయులు విస్మితులై ;

"అయ్యా! మీ కాకస్మికముగ నిట్లగుటకుం గతమేమి? దుస్స్వప్న మేదేనిం గంటిరే? "

వీరిమాట లాలకించిన పిమ్మటఁ గొత్వాలున కించుక ధైర్యము గల్గెను. భీతియుఁగొంతవఱకుఁ దగ్గఁజొచ్చెను. ఆసనమునుండి తిన్నఁగలేచి కూర్చుండెను. మహమ్మదీయు లాతని సమీపించి :

"అధైర్యపడకుఁడు. మీరింతకుమున్నది యేమో కలఁగంటిరని తోఁచుచున్నది. స్వప్నము గాంచినందులకే యింతభయము పాటు తగునే?"

ఇప్పుడు కౌశ్యాలునకు యథాపూర్వస్థితి గల్గెను. అంతఁ దాఁగనిన కలలోని విషయమెల్లఁ బూసగ్రుచ్చినలాగున వారికిం దెల్పెను. వారిది భీతివలనఁ గల్గిన స్వప్నమే కాని వాస్తవము గాదని యోదార్చిరి.

కౌశ్యాలు:—మీరీదినమింత యాలసించుటకుఁ గారణమేమి?

సత్యవ్రతు:—మేము సరియగు కాలమునకే వచ్చి యుందుము గాని మహాత్ముఁడు భాగ్యశాలి శరీరము మిక్కిలి యస్వస్థముగ నుండుటచే హకీం వారి స్వస్థానమునింటికి కొనిపోవలసెను. దాన నాతని రాత్రికిం మరల ప్రొద్దాయెను నేనాతని పరీక్షించు చుండుటచేఁ గొంచెము తడసితిని. మేమిచ్చటికి వచ్చునప్పటికి మీరు నిద్రించుచుండుటచే మిమ్ము లేపుట సరిగాదని యూరకుంటిమి.

కౌశ్యా:—మనకు రానున్న యీయాపత్సముద్రము నుండి యుత్తీర్ణుల మగుటకేదేని యుపాయముండిన నాలోచింపుఁడు.

మహాత్ము:—రాజకీయ విషయమున మన మేరికింజంకఁ బనిలేదు. చక్రవర్తి చాడీల వినువాఁడు గాఁడు. ఇంక సరోజిని విషయమొక్కటియే కదా యనిశ్చితము! ఆమె తిప్పినయుదంతము బైలుపడినఁ గష్టమగునని తలఁచి, యామెనెట్లని రావించి సంహారింప నుద్దేశించి నాళటునంపితిఁగాని యాబిడయింట

లేకుండుటచే నాతఁడీ యూరనెల్లెడలం దిరిగి వెదికియు నామె చిక్కకుండుటం దెల్పెను. ఆమె యెచ్చటికో పాఱిపోయి యుండును. తప్పినపిట్టమరల వలలోఁ బడదు. కాఁబట్టి యాబిడ విషయమై మనము భయపడ నవసరము లేదు. కవచయోగిని మనమీయూర నింతకుమున్నె వెదకించియు నాతఁడెచ్చటను గాన్పింపకుండెను గదా! కాఁబట్టి యాతఁ డెచ్చటికేని బలాయనమొనర్చి యుండును. వాఁడు మనవలన భయముననే యుల్లేఁగితుండనోపును. అట్టివాఁడింక నెన్నఁడు నీయూరికి రాఁజాలఁడు. మీరిప్పుడు ఖానఖానునొద్దకరిగి "మా అవివేకమూని యుంటచే మిమ్మింత కాలము గుర్తింపకుండినందులకు మన్నింపుఁడు. సరోజిని చేజాఱఁడిప్పిన జలిసినఁ జక్రవర్తి మా యుభయులను దండించును గదా యని తలఁచియే మేమసత్యము వల్కితిమి. కావున నిది బయలుపడిన మనయుభయ జీవనములకు హాని గల్గును. మీరీవిషయము గుప్తముగానుంచుట యత్యావశ్యక" మని వేఁడుకొనుఁడు. మహమ్మదీయ మతాభిమానమునను, దన కెచ్చట జీవనహానిగల్గునో యను నొక భయమునను, సిగ్గుచే చేటగు తనబంధనాలయమందున మెచ్చట బయల్పడునో యను సంశయమునను నాతఁడు మనమాటలనంగీకరించును. దొంగకుఁ దేలుకుట్టినట్లుగ నాతఁడూరకుండగలఁడు. అంతఁ జక్రవర్తి మన మాటల నమ్మును.

సయ్యాదు:— మహమ్మదు సెప్పుట యెంతయు నుచిత తరముగఁ దోఁచుచున్నది, అట్లు గావించుట దగును. మహమ్మదు ఖానుని భార్య శరీరస్థితిని గుఱించి మీకింతకుమున్నె తెల్పి యుంటిని గదా! అట్లుండ నిచ్చట నాలసించుట భావ్యముగాదు.

నే నావిషయమున నాతనికిఁ దోడ్పడవలసి యుండుటచే మాకిద్దరకు సెలవొసంగుఁడు.

కోత్వాలు వారినంపి మంత్రియొద్ద కేఁగుట కనువగు లాగున సమువుఁదాల్చి బంధనాగారము వైపున కరిగెను.

## పదునేనవ ప్రకరణము

# యుద్ధము

ఒక నాఁటిసాయంకాలమునఁ జిత్తోడుగడను వెలుపటి మైదాన మల్లకల్లోలముగుచుండెను. ఒక్కెడ రాజపుత్రసేనలు భిల్లసైన్యముం జేరి యొక్కుమ్మడి సుల్తాను సైన్యమును జొచ్చి పీఁదలంచుచుండెను. చక్రవర్తిసైన్యములు లెక్కకు మిక్కుటముగానుండ యవనసేనలు వెంటనే మొగ్గింపఁ దలఁచుచుండెను. ఉభయసేనలు సమరాయత్తులై యొండొరుల కెదురుచూచుచుండెను. అంతం గొంతవడికి వారికి యుద్ధము ప్రారంభ మాయెను. శేషసూరుడు జయమల్లుని సైన్యముతో మానసింహుని సేనల నెదిరించెను. జయమల్లుఁడు మానసింహునితోఁ బోరుచుండెను. మధ్యాహ్నము వఱకిర్వురు నొక్కతీరుననే యుద్ధము సేయుచుండిరి. కొంతసేపటికి మానసింహున కలయిక మెండగుచుండుటచే జయము మానసింహునాస్పద మగుచుండెను. ఇది గాంచిన పాదషా మానసింహునకు సాయపడవచ్చెను. సార్వభౌముఁడు దళము బాసటగాఁ బంపుటచే నిరుమడించిన ధైర్యముతో మానసింహుఁడు జయమల్లు ననేకవిధముల బాధింపఁజొచ్చెను. అతఁడు దానొక్కఁడె గ్రుచ్చి వారిని నరకు

నేయుక యుద్ధము నేయుచుండెను. దూరమునుండి యిదిచూచిన వీరనాయకుఁడు జయమల్లునకుఁ దోడ్పడెను. వీరశరాఘాతలను తాఁగలేక యశ్వారూఢసైన్యము వెనుకంజ వేయఁ దొడఁగెను. చెదరుచుండు సేనలఁ జక్రవర్తి యుత్సాహపఱచుచు సమ్ముఖముల గావించెను. ఉభయసేనల ననేకులు మడిసిరి. ఏరును దమ యుత్సాహమును వీడకుండిరి. చిమ్మనగ్రోవినుండి చిమ్మినటుల బంటులయొడలినుండి దొరఁగు నెత్తురువెల్లువలు పైకెగిసి తురంగ ఖురహతినెగయు పరాగము నడఁచుచుండెను, కేశాకేశిగను, బాహాబాహిగను, ముష్టాముష్టిగను సంకులసమరము జరుగుచుండెను ఎటుచూచినం బహురోమభీషణ సింహనినదములు, వీరవాదములు, భుజాస్ఫాలనములు నేకమై పెనురొద యుప్పతిలుచుండెను. గజపతుల శిరములును, ఫిరంగులును, వీరుల బాహువులును, గదాదండములును, గుఱ్ఱపుఁ బాదములును, తుపాకులును, సరిదంపుచక్రములును, జక్రాయుధములును, సైన్యముల త్రొక్కుడునొక్కుటియై చేరికొనియెను. ఇట్లు యుద్ధభూమియెల్లను బీనుఁగుపెంటలతో నిండియుండెను.

ఇట్లు చాలసేపు వీరు యుద్ధము సేయుచుండియు నిరువాగులవారు నోటువడకుండిరి. ఇరువంకుల జయాపజయములు సమముగానుండెను. అత్తఱి వీరబలభగవాన్ దాసులిర్వురు వారి బలగములం గైకొని యుద్ధము సలుపఁదలపడిరి. ఇట రాణాయొక్క యధైర్యము మెండయ్యెను. సేనలఁ బ్రోత్సాహపఱచుట సన్నగిలెను. పాదుషా యీసడి గనుఁగొనెను. ఇదియే తగు నదనని తలంచి తనసేనల నుత్సాహపఱచెను. శత్రు సేనలపై

కార్య మెద్దిగలదు? నేనిద్దాని నిలుచుకయు మెచ్చుకొనఁ జాలను. సింగం బెంత క్షుధార్తమయ్యెఁ దనవాఁడిగోళ్లు మత్తకుంభి కుంభ విదళనముగావించి యుండలి మస్తిష్కమును దినఁజూచుం గాని తక్కిన క్రిముకీటక మూకముల తెక్కసేయునే? మగటిమి గలవారలేని రూపున కీటవయుయ్య సిందుమగంటిమి గలయూ రాణిం బట్టుఁడు. అప్పుడు గాని మీరు నామెప్పఁబడయఁజాలరు

మానసింహుఁడు ;— మీరాలోచింపక మ్రాపెఁ గినియుట సరిగాదు. మీరాబాయి యీనటుఁ బోరికి రాలేదు. రాణాను బట్టుకున్నమాత్రమె యుద్ధమున కెట్లువచ్చును? ఆమెను రణరంగమునకు రావింప నిది యొక యుపాయ మగునని తలంచియే యీకార్యమాచరించితిమి.

అక్బరు:— ఆ పూఁచుది రాకపోయిన మన మాకోటం బ్రద్దలుకొట్టి లోనఁజొచ్చిన నప్పటికేని రాకయుండునే— సరి. గతము త్రవ్వనేల? ఇంత నీతకొక వటకుటీరమున నుండుఁడు. ఆశిబిరము చుట్టుం భటులఁగావలియుండుఁడు. అట్లని యీతని మిక్కిలి నిర్బంధమున నుంచకుఁడు. ఈతఁ డొక్కింతయుఁ దప్పునరించినవాఁడు గాఁడు. అన్నపానీయాదుల నీతని బాగుగ నారయుచుండుఁడు.

మానసింహుని స్వభావము ననుమతిచొప్పున నుదయసింహు నొకగుడారమున నునిచి రాజోపచారములు గావించుచుండిరి.

పదునాలవ ప్రకరణము!

# అగ్బరుని పరాభవము

---

చిత్తోడుగడమున మీరాబాయి తనభర్తకు సాయపడుటకై సేవల నంగీకరింపుచుండెను. అట్టి యవసరమున నామెయొద్దకుఁ గొందఱు రాజభటులు వచ్చిరి వచ్చినవా "రమ్మా! అశరణులగు మమ్ము రక్షింపుఁ"డని సాగిలఁబడిరి పడినవారు లేవక యట్లే యుండిరి.

మీరాబాయి:— మీరిట్లేల వగచుచున్నారు? లెండు లెండు. రాణాగారిని విడిచి యిచ్చటికేల వచ్చితిరి? వారేమైరి? వారికట్టి యపాయముఁ గలుగ లేదుగదా! మీరేల భయపడెదరు? నాశరీరమునఁ బ్రాణములుండు నంతవఱకు మీకట్టి యాపదలు రాఁజాలవు. భయముమాని జరిగినట్లుఁ జక్కఁగ వక్కాణింపుఁడు.

నావుడు భటులు మెల్లఁగఁబైకి లేచిరి కాని నోటినుండి యొక్కమాటయైన వెలువడకుండెను. వారిలో నొక్కరుఁ డించుక ధైర్యమూని;

భటు:— రాణాగా రరులకుఁజిక్కిరి. మన సేనలెల్లఁ జెల్లాచెదరై పాఱిపోయెను. శత్రువులింక మనదుర్గముం జొచ్చుటకుఁ గడంగుచున్నవారు.

ఈమాటలు వినిన మీరాబాయి మ్రాన్పడి యూర్పులిడెను. కొంత తడవునకుఁ దెప్పిఱిలెను. నేత్రములనుండి యశ్రువులు రాల నిట్లు చింతింపఁ దొడఁగెను.

“నాథా! వీరపుంగవులై భూరిబలాఢ్యులగు మీరిట్లొక తురకపందకుఁ జిక్కుపడుట యెంతయు వింతగనున్నది. ఏమి యీ కాలవైపరీత్యము! కోల్పులి యొక పిల్లికూనయాయెను. ముక్కిడి నక్క వ్యాఘ్రరాజమయ్యెను. ఆహా! విధి గడవంగ నెవరికిఁ దరము!—ఇట్టని యూరకుంట పాడియా? ఊరకుండక యబలనగు నేనేమి సేయఁగలను? ఇసీ! నేడేల యిట్టియధైర్యము పొడసూపెను? ధైర్యహాని స్త్రీలకు సాజమగుటచే నీలాగున నైతిని. రాజపుత్రవంశమున జనించిన నాయట్టివారి కిట్టి యధైర్యము గలుగుట దగదు.—ఔరా! ఈయక్బరున కెంతటి గర్వమగ్గలైను? మాపూర్వుఁడగు విక్రమాజితునకు నీతని తండ్రికిం గల స్నేహము దలఁచి నాఁడే కడముట్టింపక యున్న కొలఁది నీలాగున మించుచున్నవాఁడు. ఇదివఱకు నావిక్రమము చవిచూచి యెఱుఁగఁడు. కాబట్టియే వీడీలాగునఁ ద్రుళ్లిపడుచున్నవాఁడు. ఇదే వాని గర్వమడఁచెదను.”

ఈబిడ శోకమెల్ల నిట్లు కోపముగాఁ బరిణమించెను. అశ్రుకణములు కోపాగ్ని కణములయ్యెను. మ్లానవదనము క్రోధారుణమయ్యెను. అప్పుడీలాగునఁ దలఁచెను.

“ఆహా! నేఁ బ్రాణముతో నుండఁగనే రానాగారిని శత్రువులు బట్టుటయా? రాజపుత్రవంశమోజోహీనమయ్యెనని

యాతఁడు వలఁదేఁ గాఁబోలును? ఇదె నేఁజని వాని యుక్కడఁగించెదను. నా ప్రాణేశుని విడిపించి కొని వత్తును. ఇఁక నొక నిముసమే నాలసింపను."

మరల స్త్రీజనసాధారణమగు భీరుత్వము గొంత తల యెత్తి నిలుచు నేపు వెలుపలికి లాగుచు నుండెను. ఇంతలో నచ్చటఁ గల యాయుధము లావిడకుఁ గన్పట్టెను. అప్పుడావిడ మది నడఁగి యుండిన పరితాపాగ్ని శౌర్యాగ్నిగా మారెను. అది యంతకంతకుఁ బ్రజ్వరిల సాగెను. అంతనావీరనారీవతంస మీలాగున నిశ్చయించుకొనెను.

"రాజపుత్రికాంతనగు నేనేల యూరక వెఱచియుందును? ఒకయబల బలవంతులగు శత్రువుల జయించుటెలాగున ననుటనాయట్టివారి విషయమున గాదు. గజరాజము తెప్పె యైన నేమి? సింహీసముత్పన్నమున నవి యెల్ల నిస్తేజములుగావా? పూర్వకాలమున నెందఱెందఱాఁడువాండ్రరాతులతోఁ బోరియుండ లేదు. నరకాసుర యుద్ధసందర్భమున సత్యభామ యెంతటి శౌర్యము చూపియుండెను! కరుణాదేవి మహమ్మదుగోరీయొక్క సేనాధిపతియగు కుతుబుద్దీను నోడింపలేదా! ఇట్టి యుత్తమ క్షత్రియవంశమునబుట్టిన నేను క్షాత్రతేజము నేటఁ గలుపుదునే? మానినీమాన రక్షణార్థ మనుమానము మాని యసిలో నవక్ర పరాక్రమము చూప నిదియె యదనగుచుండ నిట్టి సమయమును వ్యర్థపుత్తునే? కాపురుషుఁడవలెఁ గనుపడి వెడలియుడు మఱఁగుడుచు నా యొడయుని విడుదల గావించుకొని యే మరలుదానను.

ఈకార్యము పూర్తి గావించుకొనక మఱల నివ్వారమున నడుగిడ బోనుగాను. ఇదినిశ్చయము.”

అని యీలాగున శపథముగావించి యుద్ధానుకూల మగు నుడుపుల నాయుధములను ధరించెను. అప్పుడాబిడ సాక్షాత్కరించిన కాళీమహాశక్తియో యన నొప్పుచుండెను. అంతనామె యాస్థానమున కరుదెంచెను. అటనంతకుమున్న కొందఱు రాజపుత్రవీరులరుదెంచి కాఁగల కార్యవిధానముల నాలోచించుచుండిరి. వారికేలాగునఁ జేయుటకుం దోఁపకుండెను. యుద్ధరంగము నుండి పర్వెత్తివచ్చిన మఱికొందఱు దమగృహముల నాఁడువారు పరిహాసించుటచే నెంతయు నొచ్చి యటనుండ నొల్లక యాస్థానమునకు వచ్చియుండిరి. వచ్చినవారు లజ్జచే నవనతశిరస్కులుగ నుండిరి. అట్టియెడ సభామధ్యమున జేరిన మహారాజ్ఞి వారిం దిరస్కారభావమున జూచుచు నిట్లనియెను.

“ఓ రాజపుత్రవీరులారా! మిమ్ము వీరులని సంబోధించుట యుచితముగాదు. నేతిబీరకాయ చందముగఁ బేరునకు వీరులగు నో రాజపుత్రులారా! యాఁడిశ్రీల విపన్నదనులై నిలువఁ బడియున్నవారలు? ఈ చిత్తోడు గడమునందలి శౌర్యాగ్ని యంతయుఁ జల్లాఱిపోయెనే! మేవాడ్ రాజ్యమెల్ల నిర్వీర్య మయ్యెనా! ప్రఖ్యాత వీరశిఖామణులతో నొప్పుచుండిన యీ రాజపుత్రస్థానము పరాక్రమహీనమయ్యెఁగదా! అతిరథ మహారథులని వాసిగాంచిన యావీరపుంగవులిట బ్యాసమాత్రావశిష్టులుగా నేల? కీర్తిమత్క్షత్రియవంశమున జనించిపగఱకు వెన్నిచ్చి పాఱివచ్చుటకు మీకుసిగ్గయినం గలుగకుండెనా? రాజపుత్రి

వంశమున కెల్ల నపకీర్తి గల్గు ననుటయుం దోపకుండెం గదా ?
ఇట్టి లజ్జాహీనులగు పిరికిపందలకు మోసేకుం జేటుగ నీ
యాయుధము లేల? మీ రెల్లరకు దైవసమానులగు రాణాగారిని
శత్రువుల కధీనముగావించి మీ పుట్టి యేమి కూడఁగెవని ఇప్పటికిం
బఱతెంచితిరి? ఇట్టినీచ కార్యమాచరించిన మిము నింక మీ
యాఁడువాండ్రైన లెక్క సేయుదురే? ఇట్టివారలు చీరలు
దాల్చి యింటనుండక మగవాండ్రవలె రాజస్థానముల కేల
రావలయును? పుట్టుకచే నాఁడుదాననైనను నేను మీకంటె
నెక్కుడు యోగ్యురాలను, పౌరుషము గలదానవగుదును. పౌరుషము
గంగం ద్రోచి, రాజభక్తిని మంటఁగలిపి, రోషము నాఁగఁ
ద్రొక్కి మీ రిచ్చట నుండనేల? పొండు, పొండు. మీ యాఁడు
వాండ్రం బంపుఁడు. వారెల్ల నాచే సుశిక్షితలై రాజుగారిని
రక్షించుకొని రాఁగలరు. నే నిటు మిము బహిరంగముగ
నిందించుచుండ మీ కేల సిగ్గుపడమనుకున్నది? ఇట్లొక యాఁడు
దానిచేఁ దిరస్కృతులగుట కంటె రణరంగమున శత్రువుల
కైదువులకు గుఱియై ప్రాణముల విడిచిన మేలగును గదా ?
మానముపోయిన పిదపఁ బ్రాణము లుండి యుపయోగమేమి?
ఇప్పటికేని రోషముగలవార లగుదురే నొకరి రాక కొర
కెదురుచూడక వారివారికిందోచిన యాయుధములం గైకొని
రణరంగమున కరుగుఁడు. ఆలసింపకుఁడు. ఇదె నేనుం దోడన
వీతెంచుచున్నాను. రాజముఖుల ప్రోగింపుఁడు. ఏకలింగజీని
తదేకాయత్తచిత్తులై ధ్యానింపుఁడు. ప్రయాణ సన్నాహము
సేయుఁడు''

అని ఇటు వీరాబాయి యొక్క వీరాలాపము లాలించిన యావీరభటులును వీరావేశము నందిరి. నిజహృదయము నందణంగి యుండిన శౌర్యాగ్ని ప్రజ్వలించెను. సేనల సజ్జీకరించుకొని, వారివారి యాయుధములం గూడ వెంటనిడుకొని బయలు వెడలిరి వీరాబాయి వెల్లనివారువ మొక్కదాని నెక్కి వారి వెంట నరుదెంచు చుండెను.

అటఁ బాదుషాదన్న వరెడరింపరాని యింక దుర్గమును భేదించుటయా? చేయఁజిక్కిన రాణాతోడ డిల్లీకరిగి, యచ్చటికి రాణి రాయబారుల నంపించి దనకు లాభకారి యగులాగున సంధి కొడంబడుటయా యను సంశయమును మానసింహాదులతో నాలోచించు చుండెను. అప్పుడు తటాలున దక్షిణదిశనుండియొక గాలివీచెను. ఆగాడ్పుచేఁ బై కెగసిన దుమ్ము గన్నులు గప్పు చుండెను. ఒక్కనిముసమాత్రల నాగాలియే పెనురొదతోడఁ దమవైపునకు వీతెంచుచున్నలాగున గోచరించెను. ఇది వినిన యక్బరచ్చెరుపడి; యీ పెనురొద యెట్టిదై యుండు నని తలచుచుండెను. అప్పుడు కొందఱు చారు లరుదెంచి, వీరాబాయి సైన్యసమేతయై వచ్చుచున్నలాగునఁ దెల్పిరి. చక్రవర్తి దనసేనల యుద్ధమునకు సిద్ధముల గావించుకొని నిలిచి యుండెను. వీరాబాయి దన చారులవలన నక్బరుసైన్యము మున్నెంబోలెఁ జతురస్రాకృతినుండుట నెఱింగి నిజసైన్యము పూర్వమువలెఁ గోణాకృతిగాఁ గావించుకొనియెను. జయమల్లాది సేనాపతులెల్లరుం దన్ను జుట్టుముట్టి యుండిరి. ఇందఱు వీరభటులుండియు బాలభానుఁడుమాత్రము గాన్పింపమి

కామె యాశ్చర్యపడుచుండెను. అతఁ డెటుపోయినదియుఁ దెలియలేదు. ఆవిషయ మెంత యారసియు నెఱుఁగవలను గాకుండెను అతఁడాలాగున నదృశ్యుఁడగుటకు వగచు చుండెను. రణరంగమున శత్రువునకుం జిక్కియుండునేయని తలఁచెఁగాని మరల నది యసంభావనీయమని యెంచెను.

ఈలాగునఁ జింతించుచు నేఁగు చుండు నాబిడ, బాల భానుఁడొక నూతన పురుషుని భుజమునఁ గత్తి వేటు దవిలిన వాని నుపచరించుచు విపర్ణవదనుఁడై యుండఁగాంచెను. ఆ నూతన పురుషుఁడట నొకతృణశయ్యపైఁ బడియుండెను. అతని తనువు నుండి వెల్వడు నెత్తురు కాల్వలుగట్టి పాఱుచుండెను. ఇదిగాంచి విస్మయమంది.

హీరాబాయి:—నీవల్లెల్లఁ జెల్లాచెదరై పోయియుండ వాని నుపేక్షించి నీవిట నుండఁగతమేమి? నీచే నుపచారములు నందు నీయోధుఁ డెవ్వఁడు? వీనింజూడ మనసేనలోని వాఁడని తోఁచుట లేదే? వీనిట కేలవచ్చెను?

బాలభానుఁడు దాను వేఁటాడ నరిగినది మొదలు మిత్రప్రియునితో నింటికి వచ్చి నంతదనుక జరిగిన యుదంత మెల్ల నెఱుక పఱచెను. వచ్చినవెంటనే యుద్ధమున కరుగవలసి వచ్చుటచే నీవృత్తాంతమును దెల్పుటకు వలనుపడదయ్యెనని వచించెను. యుద్ధమున నా నూతన పురుషుఁడు చూపిన యసమాన కౌశలమును కనుమాయా గ్రస్తుఁడగు నొక్క మహాత్మ్మదీయుఁడు కత్తిచే నఱుకఁగా నవ్వాని భుజమున గొప్ప

గాయములు దప్పులును నా బాధకుఁ దాళలేక నేలపైఁబడ, నిజప్రాణ రక్షకుఁ డావన్నెఁ దగు నన్నుపేక్షించుట కృతఘ్నత యగుం గాన నీకార్యము చరించితి ననెను. రాజు గతిగానక యీకార్య మందే నిలిచి యుండుట దప్పగుటఁ దా నాచరించిన యీ ప్రథమాపరాధము మన్నింపుమనియు వేఁడుకొనియెను.

వీరాబాయి:—యోధాగ్రణీ! ధర్మము సూక్ష్మము. అది యెల్లెడల నిండియుండును. అట్టి దాని సూక్ష్మదృష్టిచేఁ బరికించి చూచిగాని గ్రహింపవలనుపడదు. రాజుగా రేలాగున్నను నీ పతిని రక్షింపం బూనుకొనుట నీ ధర్మమే యగును. ఇది యపరాధము గాఁజాలదు.

వీరిలాగున మాటలాడుచుండ నొక గోసాయి యెచ్చటి నుండియో వచ్చెను. అతఁడు గాయము దవిలినవాని డాసి తన చాంతర్గతముగు నొక మూలిక నెత్తెను. దాని నలిపి యం దుండి స్రవించుచున్న వసరు నా గాయమునకుఁ బూసెను. మందు పూసిన యొక నిమిషములోనన గాయమునుండి నెత్తురు స్రవించుట మానెను. ఆవలఁ గొంతసేపటిలోన గాయములబవ్వళ్లు మూసికొనియెను. బాధయుఁ గొంచెము గొంచెముగ నడఁగఁ జొచ్చెను. బాధ తొలఁగుకొలఁదియు శరీరమునకు సత్తువ రాఁదొడంగెను. అంత మెల్లగ లేచి కూర్చుండెను. బాలభానుఁడు వచ్చియుండునది మహారాజ్ఞి యనుట నాతని కెఱిఁగించెను. మంత్రి ప్రియుం డామెకు వందనము గావించెను. రాణి యుద్ధమునం జూపిన యాతని యద్వితీయ నైపుణిని మెచ్చు కొనియెను. ఆబిడ యప్పటి పరిస్థితి నవలోకించి యాతనికిఁ

గొంతకాలము విశ్రాంతియుండుట మేలని తలంచెను. వానిం జితోడుగడమున కనుపం బ్రయత్నములఁ గావించు చుండెను. మిత్రప్రియుఁ డిది తెలిసి;

మిత్రప్రియుః—అమ్మా: నాశరీరమున నిప్పుడించుకయు శ్రమము లేదు. నేనిప్పుడు యథాపూర్వము బలము గలిగియున్నాను. నాయందు దయాగ్రహముంచి నాకీ యుద్ధమునఁ బాల్గొన ననుజ్ఞ యొసఁగుఁడు. నా యీ మనవి నంగీకరింపుఁడు. వీరులకు యుద్ధమునకంటె వేఱొద్దియు సౌఖ్యము గాదనుట మీరెఱుఁగని యదిగాదు.

వీరాబాయి:—అట్లె. రమ్ము—బాలభానుఁడా! ఈతని విషయమున నకారణ వాత్సల్యమూని యింతకుమున్న చికిత్సయొనర్చిన యాగోసాయి యెచ్చటికేఁగెను? ఆతని జాడ నారయుట మేలు. ఆతనికిం దగు బహుమతి యొసంగుట మన విధియగును.

అంత నచ్చటివారా చుట్టుపట్టుల నారసిరి. ఎచ్చట నాతని జాడ గాన్పింప లేదు. బాలభానుఁడు మున్నగువారలీ విషయము వీరాబాయి కెఱుక పఱచిరి. ఇట్లాతఁడు దటాలున నంతర్హితుఁడగుట కచ్చటివారెల్లఁ గడుంగడు విస్మయమందిరి. బాలభానుఁడు గొంత సైన్యమును వెంట నిడుకొని పాము పాఁకఁ దెలియరాకుండ నసవిదారి నుత్తరాభిముఖుఁడై చని *వరాహవ్యూహమున ఢిల్లీశ్వరుని సేనలఁ దాఁక సిద్ధపడు చుండెను. రత్నసింహ విజయసింహులు గొంత బలముం

గైకొని యుద్ధవిచారి యక్బరాగమనముం దెలియుక ♦ధనుర్వ్యూహ మున నాతని సేనల కిరు వంకలందాఁక సంసిద్ధులగు చుండిరి. వీరాబాయి జయమల్లుఁడు నఖండసేనా సమేతులై శత్రు సైన్యముల కభిముఖముగ నడచిరి.

యుద్ధమునకు సన్నద్ధుఁడై యున్న యక్బరు రిచ్చవడి;

"ఆహా! ఒక్క యాఁడుది యింత ధైర్యమున సేనలం గూర్చుకొని వచ్చు చున్నదిగా! అబలయయ్యు నీబిడ పిరికి పంద యగు నారాణాకంటె నెన్నియో మడుంగులు మిన్న యగును. ఓహో! సేనల నెట్టి చమత్కారమున నడుపుచు వచ్చు చున్నది! మన సేనలకంటెఁ దగ్గినదయ్యు నీబిడ యొక్క ప్రోత్సాహమునఁ గదా సైన్యము లెంతయు నుత్సాహముతో వచ్చు చున్నయవి!"

అని యీతఁడు తలఁచు చుండఁగనే రాజపుత్త్రి సైన్యము సమీపించెను. పాదుషా యెదుటి వారి వీరావేశ ములఁ గాంచి భయభ్రాంతుఁడయ్యెను. ఘోరసంగ్రామ మారంభమయ్యెను. లబ్ధవిజయ మగుటచేఁ జక్రవర్తి సైన్య మునకును, దోఁక ద్రొక్కిన త్రాఁచువలె రోషావేశ పరవశ మగుటచే రాజపుత్త్రి సేనకు నుత్సాహము దఱుఁగకుండెను. దాన నొకరి కొకరు దీసిపోవక రణము సేయుచుండిరి రాజపుత్త్రి సేనా కాంతారమునకు

* పరిహారవ్యూహము-పంచాంగరకెఁ జిందరవందరగఁ జొర్రెత్తుచు శత్రువులం జాఁచఁగనే యుండుట నొక్కటిగఁ జేరుట

♦ ధనుర్వ్యూహము. వింటివలె నర్ధచంద్రాకృతిం బాల్చి శత్రువుల నెదిరించుట.

దావదహనముగా నక్బరును, దురుష్క సేనా సముద్రమున కగస్త్యుఁడుగా వీరా బాయియుఁ గోచరించుచుండిరి. కావున వీరి ధీరాలాపముల వినుచుండిన యా యుభయ సేనలుం దమ ప్రాణములఁగూడ నరకుసేయక యుండెను. బందూకుల దెబ్బలకుఁ బాఱక, కత్తుల దెబ్బలకుఁ గాతరబడక, ఫిరంగుల దెబ్బలకు భీతులుగాక, బాకుల దెబ్బలకుఁ బఱ్వలిడక, వీరవాదములకు విముఖులుగాక, గాయములకుఁ గలఁగిపోవక యిరువాగులవారును సైర్యముతోడ యుద్ధము సేయుచుండిరి.

ఇట్లు ఘోరముగ యుద్ధము జరుగుచుండఁ జక్రవర్తిసేన లెల్ల నిచటనే చిత్రముగ హతించుచుండెను. అప్పుడు తటాలున నక్బరుసేనలో, వెనువైపున నొక కోలాహలము గల్గెను. సార్వ భౌముఁ డద్దాని కలత తెలియఁ గోరుచుండ నింతలో నిరుపార్శ్వములనట్టి కలకలము యారంభ మయ్యెను. అంత నక్బరాశ్వము మెఱుంగిరా నొక భటునను, వాఁడేగి, యూరసి వచ్చి కలతెఱుంగఁ జెప్పఁగించెను. అప్పుడు సుల్తాను నిజబలమెల్లం దావదహనపరీతంబగు కృష్ణసార సంఘము రీతిని శత్రుపరీత ముగుట నవలోకించి చేయునది లేక రిచ్చపడెను. వచ్చినయాపద నెట్లుందప్పించుకొందునో యని పరితపించుచుండెను. రాణి యాతని కాతరత గని పట్టి తన సేనలం బ్రోత్సహించుచు విజృంభించు చుండెను. ఢిల్లీశ్వరుఁడు వారి ధాటి కాఁగ లేక,

"అయ్యో! తెలిసి తెలిసియు నేనేల వీరితోడ యుద్ధమున కుపక్రమించితిని ? కడంగితిఁబో! ఉదయసింహుఁడు చేతిఁ

జిక్కినంతన యూరికి మొగలకయేల మసలితిని? అలసించితినో! అప్పుడ రాణాను వదలి సంధియొనర్చుకొనక పోరఁ దొడఁగనేల? ఎల్లెడల రాజపుత్రసేనలు నిండియున్న యిప్పుడైన నేమిసేయ వగును? కాలము సరిగా నప్పుడు తగ్గుట గాదువ గాదని తలంచి సంధి యొనర్తునా? చక్రవర్తినై, యువక్రవిక్రమమునుచూపి, యరి భయంకరుండని వాసిగాంచియుండిన నేనిట్టి కార్య మాచరిం చుట దగదు. నశ్వరమగు నీశరీరమునకై శాశ్వతమగు యశము పాడుచేసికొనుట పాడిగాదు "మనితోడన పుట్టు మృత్యువు జనుల"కనుట నిక్కువముగదా! అట్టివి సాహసించుటకు ధైర్యము చాలకున్నది. చచ్చిన పిదప నేమిసేయఁగలము? బ్రతికియుండినఁ గదా సుఖముఁలఁ బడయ వచ్చును!"

ఈ లాగునఁ దలపోయుచుండు చక్రవర్తి చెంతకు మాన సింహుఁ డరుదెంచి;

మానసింహుఁడు:—దేవా! శత్రు సేనలు మనసైన్యముం జుట్టుకొని యుద్ధము సేయుచున్నవి. విజయము మనకుఁ గల్గునని తోఁచుట లేదు, సైనికుల ధైర్యము గాంచి జయము గల్గునో యని యించుక తలంచినను ప్రతిపక్షుల విజృంభణముం దిలకించినంతన యది గొంతెమకోర్కె యని తెలియు చున్నది.

అక్బరు:—సంధి ప్రయత్నము సేయ వచ్చునా?

మానసింహుఁడు:—అది యుక్తతరమని తోఁచెడిని.

అక్బరు:—ఆ ప్రయత్నమునకు రెండడ్డములు గలవు.

మాబోంట్ల కాలాగున నాచరించుట తలవంపులు గదా యనుట యొక్కటి.

మానసింహుఁడు:—కాలమొక్క తీరున నుండఁబోదు. ఇప్పుడు వారికి జయకాలము. మన కింకొకప్పు డిట్టికాల ముప్పతిలుఁగదా? ఇంక రెండవదెట్టిది?

అక్బరు:—వారిప్పుడు జయమునుగాంచిన వారుగదా?

మానసింహుఁడు:—ఓహో! తెలిసెను. సంధికి వారొడఁబడకున్న నట్లని యాలోచించుచుంటిరి కాఁబోలు! చక్రవర్తియే సంధికి రానున్న నొడఁబడక యుందురా? తనంతన కల్గు నైశ్వర్యమును గాఁదన్ని త్రోలఁగఁద్రోచుకొను వారలు లోకమున నుందురా? మీరీవిషయమున సంశయింపఁబనిలేదు.

అక్బరు:—అయిన నింక మీ యిచ్చవచ్చిన నట్లే యొనర్పుఁడు.

అప్పుడు బాలభాను మిత్రప్రియులొక్కెడ నక్బరు సేనాసాగర మల్లకల్లోలమగు లాగునఁ దమ పరాక్రమము చూపుచుండిరి. అత్తఱి నూతన పురుషుఁ డొక్కరుఁ డరుదెంచి వారికిం దోడ్పడెను. వాఁడు తన యపూర్వ పరాక్రమముం జూపుచు సుభటాళి సేనల లోనివారి మెప్పునడయుచుండెను. పిరాణాయి శత్రు సైన్యమున ప్రవేశించి చూచిన వారి నెల్ల నఱుకుచుండెను. ఎట్టివీరుఁడు నాతని యెదుట నిలుచుటకు భీతిలుచుండెను. అలాగునఁ బ్రచండ వేగమున శత్రువుల ఖండించుచుండిన యావీరవనిత యక్బరు

నెదుట నిలిచెను. అప్పటియాబిడ యాకారము గాంచినంతన సుల్తాను భయాకులుండై తత్క్షణమ సంధి సూచకమగు పతాక మెత్తించెను. రాణి అనిమిషమునసే తనచేతి కరవాలము గోశమున వైచెను. మిత్రప్రియుండు మాత్రము చక్రవర్తి యెత్తించిన సంధిసూచక పతాకమును నరకుసేయుక యాతని కంఠమునకుం జాటిగం దన కత్తినెత్తెను. ఇదిగనిన రాణి;

పీరాబాయి:—వలదు వలదికార్యము.

"గీ॥ చంపందగినయట్టి శత్రువు దనచేతం
జిక్కెనేనిం గీడు సేయరాదు
పొసగం మేలు సేసి పంపుమనుటే చాలు"

అనుట యోంచుగవా?

అనినంత మిత్రప్రియుండు దన కత్తినొరను వైచెను. రాణి తనసేనలం బోరు సాలింపవలసిన ట్లానతిచ్చెను. సైనికు లామెయాజ్ఞ చొప్పునం దత్క్షణమే యుద్ధమాపిరి. చక్రవర్తి యుదయసింహు నాబిడ కర్పించెను. చిత్తోడుగడముపై రాజు లేరని యుద్ధమునకు వచ్చిన దానం వీరికి సాయపడులాగునను, నింకమీందట నెప్పుడేనిం దగిన కారణము లేనిద వీరిపైకి యుద్ధమునకు రాకుండు లాగునను సంధి కుదుర్చుకొని బ్రతుకు జీవుండాయని తనసేనలతోడ నరిగెను.

పదునేడవ ప్రకరణము

# పరమార్థ పరిజ్ఞానము

అక్బరుతోడ యుద్ధమొనరించి వాని వెడల నడంచిన మీరాబాయి దన సైన్యముల గాటంపు గాయములు దవిలి బాధ పడువారిని వైద్యశాలలకుం బంపెను. వారి పరిచర్యల విషయమునం గడు జాగరూకతం గ్రిందిలాగున భిషగ్వరుల శాసించెను. సంగరమున నెంతయు గెంటియు చూపిన వారినిం దగులాగున సంభావించుచుండెను. అంగవికలురగు కొందఱకు యావజ్జీవము దారవేతన మీవలయునని యాజ్ఞ చేసెను. వారిబాదుగు లేలేని శూరులుండిన నట్టివారికి వారిస్థానముల నీవలయునని కట్టడ సేసెను.

ఇంతలం గొందఱు సైనికులు సమీపమున నుండు జలాశయమున కరిగి రక్తసిక్తములగు నిజ వస్త్రముల నుదికి యారంగట్టుచుండిరి. కొందఱు శరీరమునం బట్టిన పట్లెల్ల పీడు నట్లీదం దొడంగిరి, కొందఱు స్వస్థులై యుచితాహారముల మెసవి చెట్లనీడం గూర్చొని, తమ మిత్రులతోడ నాయుద్ధ విషయములం గుఱించి యీలాగునం బ్రసంగించుచుండిరి.

“ఆహా! ఈ చక్రవర్తి సైన్యమెంత యధికము! అది యొక మహాసముద్రమువలెం దోంచుచుండెను.”

"వాని సేనలోనను మహమ్మదీయుల కంటె నెన్నియో మడుంగు లధికముగ రాజపుత్రవీరులే యున్నవారలు. దీననే వానికి జయముగల్గుచున్నది."

"ఈతనికి లభించిన రాజ్యమెల్ల మనవారు మనవారల జయించి యిప్పించినదియే యగును, ఇతఁడుగాని యీతని మహమ్మదీయ భటులుగాని కష్టపడి సంపాదించిన దించుకయు నుండదు."

"ఎంతసేనయుండిన నేమి యువకయోగము! ధర్మముండు చోటఁగదా విజయము గల్గును."

"పాపము! పాదుషా యీతనికి వెడలునపుడు మోమునఁ గత్తివాటు పైఁబడను నెత్తురుండఁ బోదు. ఇంక నెవ్వటికై వైపునఁ దలఁపడఁడు."

"బుద్ధిమంతున కియ్యది పొసఁగుఁగాని యిట్టివానికిఁ గాదు."

"పాముకుఁ బాలు వోసిన నయ్యది విషవృద్ధికిం గారణమగును. అలాగుననే వీని కెంత యుపకృతి చేసినను వీని క్రూరత్వమంత కంత యభివృద్ధి యొనర్చునట్లగును."

అని యీలాగున మిత్రగోష్ఠిం జరుపుచుండిరి. మరునాటి దినమున వీరాబాయి దుర్గమెల్లెడఁ జక్కఁగఁ దోరణాదులచే నలంకృతము గావించెను. పట్టంపుటేనుఁగుపై సువర్ణపుటంబారి గట్టించి తానును రాణాయు నధిష్ఠించిరి. మంగళ వాద్యఘోషము ఘోరముఁ జెలంగుచుండెను. ప్రజలు కరతాళధ్వనులు

జయజయ ధ్వానములం జేయుచు వెంటవచ్చుచుండిరి. శచీ పురందరులవలె రాజదంపతు లత్యుత్సాహమున నూరేగుచుండిరి. సౌధోపరిభాగమునుండి పౌరాంగనలు పుష్పములు నా దంపతులపైఁ జల్లుచుండిరి. రాణాగారు బంగారు నాణేముల రెంకుచేతుల నెత్తుకొని బాట నిరువంకల వెదఁజల్లుచుండిరి. బీదలనేకు లా ధనరాశిం జాలు మోయఁగల్గినంత వఱకు నెత్తుకొని పోవుచుండిరి.

ఇట్లమిత వైభవముతో వచ్చు నా రాజదంపతు లాస్థాన మండపము సమీపించి భద్రగజము నుండి యవరోహించిరి. అంత నుదయసింహుడు మంత్రులు కైదండ లివ్వ చుండ మండపము లోనికి వచ్చెను. రాణి వారి వెనువెంట వీతెంచెను. రాణాగారు సింహాసన మధ్యమున నాసీను లైరి. మీరాబాయి రాజానుజ్ఞాతయై ప్రక్కన నొక యాసనము నధిష్ఠించెను.

మంత్రి సామంతాది పరివారమెల్ల నుచితాసనముల నాసీన మయ్యెను. అప్పు డుదయసింహుఁడు రాణి నవలోకించి:

ఉదయ:—ప్రేయసీ! అపారమగు చక్రవర్తి సేనా సమూహ మవలీలగ నేలాగున జయింపఁ గలిగితివి?

మీరాబాయి:—అది దేవర వారి యనుగ్రహము వలన నాయెను;

ఉదయ:—ఇట్లు నెఱుగఁగంటిమి చూపిన నిన్నెంతకొని యాడినం దనివి దీఱదు. ఈ బాలభాను మిత్ర ప్రియుల

యుద్ధమున మన కుపకృతి గావించి నందులకు వారి కెల్ల నెంతయుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాఁడను.

మీరాబాయి:—భృత్యు లొనర్చిన సేవల నధికారిం జెందుగా. కావున దేవర వారి భృత్య వర్గమునఁ జేరిన మా యీ యల్పకార్యమున కేము ప్రశంసనీయులము గాము.

ఉదయ:—అందుదాన నయ్యా యింతటి ఘోర సంగ్రామ మాచరించినది నాకు వింతఁ గొల్పుచున్నయది.

నావ్రజ సభామధ్యమున నుండి సాహిదాసు భోంసా యను వాఁడు లేచి నిలిచి;

సాహిదాసు:—రాజచంద్రా! అవధారుఁ డస్మద్వచనము
"సంగ్రామే సుభటేంద్రాణాం కవీనాం కవిమండలే।
దీప్తిర్వా దీప్తిహా నిర్వా తత్క్షణా దేవ జాయతే॥"

అనునట్లు యుద్ధమున సుభటులకు బల బలహీనులలో నొక్కండు వెంటనఁ గల్గును. పూర్వము డిల్లీశ్వరుని భర్తియగు సంయుక్త యాహవగంధ మనునంతయు నాఘ్రాణింపని దయ్యు మహామ్మదు గోరీతోడి యుద్ధమున నెట్టి యసమాన పాండిత్యముఁ జూపి యుండలేదు. ఎందఱు ఆఁడువాండ్రిట్లు యుద్ధరంగమున బీరములు చూపి వాసిఁ గాంచి యుండలేదు

ఉదయ:—నీవాడుట సత్యము. మంత్రి సామంతులారా! రణముల మూలమున నెందఱో సైనికులు నిహతులైరి. కావున సైన్యమింక నభివృద్ధి గావింప వలయును, దుర్గమింకను

బాగుసేయుంప వలయును. ఆ కారణ ప్రీతి ననాహూతుం డయ్యు, వచ్చి మనకమితోపకృతి గావించిన యీ మిత్రప్రియానంతియు గారవించుట ముఖ్య విధి యగును. ఇంక సరోజిని గతి విచారింప వలదా?

వీరా:—నాథా! మీరటు రణరంగమున కరుగఁగనే నే నేకలింగజీయొక్క యాలయమున కేఁగితిని. అట నాదేవిని ధ్యానించుచుంటిని. అట్టియెడ "ఓ రాజ్ఞీమణీ! తప్పక నీకు జయము గల్గును. సరోజిని యను కన్యక యాపదల పాలు గాక సురక్షితయై మెలఁగుచున్నది. కావున నా విషయమున చింతనొంద నవసరములే"దని యొక యశరీరవాణి వినవచ్చెను. దాన ధైర్యముగల్గి యావిషయమై విచారింప వచ్చును.

వీరిటు మాటలాడ చుండఁగనే యొక సేవకుఁ డేతెంచి; "ఢిల్లీనుండి యొక సందేశహారుఁ డరుగుదెంచి ద్వారమున వేచి యున్నాఁడు. దేవర ముదలయైన లోనికంపెద"ననెను. రాణా గారు "దడవుసేయక వానిం బంపున" దన సేవకుఁడు రాజ నానతి చొప్పున వాని లోని కంపెను. వచ్చినవాఁ డా రాజ దంపతులకు సమస్కృతు లొనర్చి;

శేఖావతుఁడు:—అమ్మా! ఆనాఁడు మీయానతి చొప్పున లేఖం గొని యేఁగిన వాఁడను. ఢిల్లీపురమునఁ గొత్వాలునకుఁ జిక్కితిని. అతఁడు నన్నుం జెఱ మునిచెను. అంత మహానుభావుఁ డగు నొకయుద్ధభటుఁ డక్బరు నానతిం గొని నన్నుఁ జెఱనుండి తప్పించెను. సరోజిని యంతకుమున్నే చెఱంబడియుంట నామెంగూడఁ జక్రవర్తి యాజ్ఞపైఁ

దప్పించెను. ఇప్పుడా బిడ పృథ్వీరాయల యధీనమున నున్న యది. ఆయమ్మయే మీకొక కమ్మ యంపెను. చక్రవర్తి సేన లీదుర్గాభిముఖములై వచ్చు చుండుటచే బాటను వచ్చుట శ్రేయోదాయకము గాఁ జాలదని తలఁచి యడవి దారింబట్టి వచ్చుటచే సింత తడవాయెను. ఇదె సరోజిని వ్రాసినపత్రిక. దీనిం జిత్తగింపుఁడు.

అని తాఁదెచ్చిన లేఖ రాణిగారి ముందిడెను. ఆబిడ వచ్చినవాని నుచితాసనమునఁ గూర్చుండ నియోగించి యాజాబు రాణాగారి మ్రోలనిడెను. రాణా యాయుత్తరము చెంతనుండు నొకని యొద్దనిచ్చి చదువుమని యానతియ్యఁగ నాతఁడీలాగునఁ జదువఁజొచ్చెను.

ఢిల్లీ

స్వస్తి శ్రీమన్మహారాజాధిరాజ రాజపుత్ర సంస్థానభద్ర పీఠాలంకృతోదయసింహ సార్వభౌమ ధర్మపత్నియైన మీరాబాయి రాణిగారి సముఖమునకు,

ఢిల్లీపుర వాసినియై యనుకంపనీయ యగు సరోజిని యొనర్చు మనవి.

మనుజులెల్లరు సుఖదుఃఖము లందును, మానావమానములందును ఏకస్వరము దోఁపవలయుననుట మీ రెఱుంగని యది గాదు. తల్లిదండ్రులు నిజసంతానముల ప్రియహితము లాచరించుచుండుట లోకములో నాచారమయ్యు నీ యనాథ యంతటి నోము నోఁచుకొనలేదు. బాల్యముననే జననీజనకులు

మృతినందిరి. ఇంక 'రాజా బంధురబంధూనా' మనులాగునఁ జక్రవర్తికి శరణుపొందుదమన్న నాతఁడే నాపై నపేక్ష నొంది యుండ నద్దియు సంభావనీయము గాదు. ఇట్టియెడ నాకొరులు దిక్కగువారు లేరనుట మీకు నగతపూర్వమే కదా! పాప మీపృథ్వీ రాయలొక్కరుఁ డున్నవాఁడు. ఉండిన నతఁడు బలవంతుఁడగు చక్రవర్తి యొనర్చు వంచనఁ గొంతవఱకుఁ గనిపెట్టి ప్రతిక్రియ సేయఁగలఁడుగాని, మించినచో నేమి సేయఁగలఁడు? మీరు నావలె నాఁడువాఁడగుటచే నింతకంటె నధికముగ నేను వ్రాయ నవసరముండదని తలంతును. మానసీమానరక్షణ మవరిహార్యమనుట ధర్మము తెలిసిన వారికి నొక్కి వక్కాణింపవలయునే! ఇంటనుండిన నేమి క్షేమమానునో యని యిటకు రా బయలు వెడలి మార్గమధ్యమున నొక మహమ్మదీయునకుఁ జిక్కితిని ఆయుప్పు దప్పుచో ప్పాగముచుండఁ జక్రవర్తిచేఁ జెఱఁ బెట్టఁబడితిని. దైవవశమున నాయెడ నొక దయామయుని మూలమునఁ బొసెను. నేనీ యూరనుండు సంతదనుక నాపద నన్నుఁ బట్టియున్న దనియే భావింపవలయును. నాయనుంగు చెలి మాలిని నన్నల్లప్పుడు సహస్రసవృష్టలతోఁ గాపాడుచుండునది యువ్వ చెప్పట నుండుటయుఁ దెలియకున్నది. నాయీ లేఖకు మీరు బదులాలసింపక యీవలయును. లేకున్న నేవిషమునకో జలాశయమునకో నా ప్రాణము లర్పితములుగాఁ గలవు. ఎట్లును గాకున్న నా ఖడ్గమే యీవిషయమునఁ దోడ్పడఁ గలదు. మాన హానికంటె నాత్మహత్య వలసంగల్గు దోష మెక్కుడగునని భావింపను. పవిత్రమగు రాజపుత్రవంశమున జనించియుఁ

దుష్ఫలము గూడ ధనాశచే; నీచకార్యమని నిరోధింపక, పాపమూల మని భయముండక, యవమాన కరమని యూఁగక, లోకులు వెక్కిరింతురని వెఱపులేక, కులమునకుఁ గళంకా పాదియగు నకార్యములొనర్చియుఁ బశ్చాత్తాపముండక లజ్జాహీనులై మెలఁగెడి యూసీచపు మెలఁగెలవలె నేనుండఁజాలను. సుక్షత్రియవంశ జాతనై యొక మహమ్మదీయుని పాలఁ బడుటకంటె నద్దేనొక క్రూరసర్పము వాతఁబడి యసువులు వాయుట కేని వెను దీయననుట నిశ్చయము, వేయేల? దమయంతి, "హాస్తైతవాస్తే ద్వయమేవ" యనినియాంసతో నాడిన లాగున నాచావు బ్రతుకులు మీచేతిలోనివి కావున మీఁదివని యెల్ల మీపాలవిడిచి యే నింతటితో వ్రాయ విరమించుచున్న దానను. అటుపైని మీ చిత్తము, నాభాగ్యము.

ఇట్లు
మీదాసురాలు.
సరోజిని.

అని చదివినంతనే యుదయసింహుఁడు మిపులఁ జింతాక్రాంతుఁడై;

ఉదయ:— ఔరా! ఆ బాల కి బాల్యమున నెట్టి యిక్కట్టులు గల్గెను! ఇన్నిటికి నాదుష్టుఁ డక్బరే నిదానము. ఇట్టి వానినేమి యొనర్చి రేసియుఁ బాపము గల్గఁబోదు. ఇంక నించుకయుఁ దామసింపక యిటకు రావించుట మేలగును. కాఁబట్టియిట నుండి యేరినే నచ్చటి కనపవలయును. ఇది దెలిసినఁ జక్రవర్తి వారికద్దేని హానిగల్గించునేమో! అట నుండియె యేరినేని

సాయము గొని రమ్మందుమే యుండిన నదియు నపాయరహిత మగు నని తోఁచుటలేదు.

వీరాబాయి!—దేవా! ఈపని నిర్విఘ్నముగ నొనర్ప బాలభానుఁడు దగువాఁడు. అతనికిఁ దోడుగ నీ మిత్రప్రియుం గూడఁ బంపవచ్చును. వీర లాతని పాలఁబడక యాబిడం దప్పించి తాముం దప్పిరాఁగలరు.

ఉదయః:—చెలీ! బాలభానునితో నీతనిఁ బంపుట సరి" గాదు. ఇతఁడింతవఱకు యుద్ధమొనర్చి యలసియుండు వాఁడు. చూడుము. కుసుమ సుకుమారములగు నీతని యంగకము లేలాగున వాడువాఱి యున్నవో. కాఁబట్టి యితని నిప్పాను పొమ్మను టుచితము గాదని తోఁచెడిని.

వీరాబాయి;—పరాక్రమవంతు లాపన్నుల యాపదఁ బాపుటకై ప్రాణముల నేని దృణీకరింతురు.

మిత్రప్రియుఁడు:—దేవా! నావిషయమున సట్టి సంశయము వలదు. ఏలినవారి యానతియైనం బోయివత్తును.

సందేశహారి యీగొంతు సవ్వడి వినఁబడఁగనె మోము పరికించి చూచుచుండెను. అతఁ డాలాగునఁ దన్నించుక సాశయించి చూచుచుండుటఁ గాంచిన మిత్రప్రియుఁ డవనత వదనుఁడై యుండెను. లేఖాపహరుఁడు తన యుష్ణీషము నత్తి క్రింద నుంచెను దాని నుండి యొకలేఖ క్రిందఁబడెను. వాఁడాజాబు నెత్తఁగనే దాని పైవైపున;

"శ్రీభీమసింహ తనూజాతయగు సరోజినీబాయికి.

రాణాగారి యాస్థానము. చితోడు."

అని యిట్లుండుటఁగని విస్మితుఁడై హీరాబాయి యొద్ద నా లేఖ నిచ్చి;

సందేశహారుఁడు:—అమ్మా! సరోజిని యిటకెప్పుడు వచ్చెను? ఆబిత యిప్పుడెచ్చట నున్నయది? ఆమె మీ యాస్థానమున నుండ మీరింతవారికిఁ గావించిన సంభావన లకు భావమేమి? ఈ కమ్మ నేను లిఖించితి? ఇది నా యుష్ణీష మున నుండఁ గతమేమి?

హీరాబాయి యీ జాబుం జూచి యాశ్చర్యము పొందెను. పరిపరివిధముల నాలోచించెను. ఆబితకేమియుఁ దోఁప కుండెను. సరోజని యిచ్చటికి వచ్చుట యసత్యముగు నేమో యని తలఁచెను. నిశ్చయముగా నున్న నీ లేఖ యేల వచ్చునని యెంచెను. వచ్చినచోఁ దనకుఁ గాన్పింపక యుండునే యని పూర్వసంశయము వాసెను. యీ జాబు వేనమున నున్నఁ దానామెకు గనిపెట్టఁ జాలకుండ రాదా యని తలఁచి మరల సంశయాకుల యయ్యెను. కడ కాలేఖం జదివినఁ గొంతవఱకు సందేహము వీడునేమో యని భావించెను. పెఱవారి యుత్తరములం దాఁ జదువుట న్యాయము గాదని యాకార్యమువలన విరమింపఁ దలఁచెను. లేఖం జూచుట యందలి యుత్కంఠాతిశయ మాతూష్ణీంభావము నణఁగఁ ద్రొక్కుటచేతను, దీనిమూలా

మున నిశ్చయము బయల్పడ వచ్చును గదా యను నానచేతను నాయుత్తరమును జెంతనుండు నొకనికిచ్చెను. అతఁడద్దాని నందుకొని యీలాగునఁ జదువఁ దొడంగెను.

చీటోడు.

బిడ్డా !

నీవిట మగనిం బేలుపుచ్చి యెంత కాలము కపటనాటక మాడఁ దలఁచితివి ? నీ కుశలము గోరి యనూనా తటమున నీ కాయుపదేశము చేసితిఁ గాని యెల్లప్పుడు నీవీలాగుననే యుండవలయునని నామతము గాదు. అపతపాలు గాకుండ నిను రక్షించుచుండు నాకు నీ శ్రేయోభివృద్ధికి వలయుదానిం జెప్ప వలసినది విధియగును. నీమిత్రుని మెప్పించివలలోఁ జిక్కించు కొంటివి. ఇంక నీరూపు వేసము వలని యుపయోగ మేమి? బాల భానూదయానంతరము మిత్రప్రియ యగునకోజని యుల్లాస మందకుండ వచ్చునే? మేల మాడఁదలఁచి కాల యాపనము సేయుట యనుచితము. రాఁగాను నీవివయముతూన నెంతయుఁ జింతఁగొని యున్నాఁడనుట నీవెఱుఁగవా! ఇంక నీవిట్లుండట పాడిగాదు.

ఇట్లు,

నీ శ్రేయోభిలాషియగు కపటయోగి.

ఈ లేఖం జదువుచుండ మిత్రప్రియుని మోము మొగతీరున నుండెను. బాలభానుఁ డీమాఱ్పునకుఁ గత మేమగునని యాలోచింపసాగెను. నీరాబాయి 'మిత్రప్రియ' యనుశబ్దము

విని తప్పటినుండి సంశయముండెను. వాని మోమునందలి మార్పు సందేహమును స్థిరపఱచుచుండెను. అంత నామె ;

"ఈయంగ సౌష్టవ మీామీాసకట్టు మొలవకుండుటయుం జూడ నీవ్యక్తి స్త్రీ వ్యక్తియాయని తోఁచెడిని గాని పురుషాకృతి రెయుం దడ్డపడుచున్నయది". అని చింతించు చుండెను.

ఆ సమయమున నాసభా మధ్యమునుండి "సరోజిని మిత్రప్రియుత్వమందుంటలో విస్మయమేల?" యను ధ్వని విన వచ్చెను. మిత్రప్రియుఁడాధ్వని గుర్తుపట్టి కవచయోగి యచ్చటికి వచ్చి యున్నవాఁడని గ్రహించి స్తూవడి నిలిచెను. మీరాబాయి ఈశబ్ద మెచ్చటినుండి వచ్చెనని, యాసభ గలయం జూచెను. ఆ రవ మొనర్చినవా రిట్టివారని తెలిసికొనఁ జాలకుండెను. సభలోనివారెల్ల రాశ్చర్యపరవశులయిరి. శేఖ వమాఁడు చక్కఁగగుర్తించి;

సందేశహారుఁడు;—ఔరా ! ఎంత సాహస మెంత సాహసము! సరోజినీ! శేఖ నిచ్చినదాన వట్లు నిలిచియుండక యింతలోన నంత యవసరపాటు నరియగునే ! దారినేమైన విపరీతము సంభవించిన నట్లగును? మగవేస మూనినంత మాత్రన మగవాఁడవగుదువే ! ఎట్టిశౌర్యవతివైన నాఁడు బుట్టువనుట మరచితివే!

రాణా మున్నగువా రాశ్చర్య పరీత చిత్తులై చిత్ర ప్రతిమలవలె నిలుచుండిరి. అప్పుడు సరోజిని లేచి రాణాను రాణికిని నమస్కరించి ;

సరోజిని;—మహనీయు లగు నో రాజదంపతులార! నాయపరాధమును మన్నింపఁ బ్రార్థించుచున్న దానను. మహిత చరిత్రులగు సభాసదులార! నా యీతప్పు సైరించి నన్ను మన్నింప వేఁడుకొను దానను. కారణము లేక, తొందరపడి యిలువెడలి వచ్చినదానను గాను. నిస్సహాయునై యురుదెంచితి నని తలఁచి కినియకుఁడు, నేఁజెలఁగవ్వటం దెలిసిన ఖాన ఖానుఁడు నను గొంపోయి పదపా కొసంగ నపేక్షించి యొక నాఁటి రేయి మాఱువేసమూని నాయింటి కరుదెంచెను. పీనికపట వర్తనమెఱిఁగిన యొకపచయోగి నన్నావదల పాలుగాకుండఁ బత్తనము నుండి తప్పించెను. నే నాతని యానతి చొప్పుననే మార్గమున నెట్టియాపదయు రాకుండుటకై యీవేసమూనితిని. ఆత్మరక్షణార్థ మాతఁడిచ్చిన తుపాకిఁ జేకొంటిని. అట్లగా వఱకాతఁడు నాకుఁ దోడుగ వచ్చి తనకెద్దియో యనివార్య మగు నొకకార్యమున్నదని చెప్పి వెడలిపోయెను. అంత నీదుర్గాభి ముఖనై వచ్చుచు గంగాతీరమున నీమహాభాగుని సంధించితిని. ఆవలి యుదంతము మీకవగత పూర్వమే కదా!

అని పచియుంచి నంతనే స్త్రీ జన సాధారణమగు లజ్జ యుదయింప నవనత వదన యయ్యెను. పీరాబాయి మోమున జిఱునగ వంకురింప బాలభాను నవలోకించి;

పీరాబాయి:—శూరశిఖామణి యగు నో బాలభానుఁడా! నీప్రాణములం గాపాడినది నీ మేనమఱందలే కదా! ఈబిడ యవివాహితయగుట నీ వెఱిఁగినదియే యగును. మాప్రావు నందుండు

నీమెకు మేము జననీజనకుల మగుదుము. కాఁబట్టి యుక్తవ్యక్తిఁ బరిణయము గావించు భారము మాపై బడియున్నది. అది యట్లుండనిమ్ము. నీవీ యుద్ధమునఁ జూపిన యపార శౌర్యమునకే మెంతయు నలరినారము. నిను బహూకరింప నింతకు మున్నే తలఁచి యుంటిమి, దైవవశమున నిప్పుడదియుం జేకూఱెను. నీచూపిన యసమాన పరాక్రమమునకై యీ కన్యారత్నమును నీకు బహుమానము గావించితిని. ఈయువతి నీకుం దగునదనుట నేఁ గ్రొత్తఁగఁ దెల్ప నవసరము లేదుకదా! ఈయువిద ముగుద యగుట నీమెను నోనాడకుండుట నీవిధియగును.

బాలభానుఁడు:— మహాప్రసాదము మీ యానతి జవదాఁటను.

వీరాబాయి:— నీ మేనమఱఁదలి యెడ నీవు ప్రీతిగలిగి యుందువనుటకు లోటులేదు. మే మీమెను మా సుతఁగా భావించుటచే నిట్లాడ వలసెను.

ఉదయ:— యోధాగ్రణీ! నీకీమెద్ధియుఁ గ్రొత్తఁగఁ దెల్పఁ బనిలేదు. అయిన నొక్క యంశము మాత్రము సెప్పెదము. ఎంతటి బలశాలినియయ్యు నబల యాఁడుదియే కాఁబట్టి యీమెను నీవు యుద్ధముల కరుగునపుడు వెంట గొంపోవలదు.

సరోజిని:— ఆర్యా! రాజపుత్రి వనితనగు నాకు మీరిట్టి కట్టడ యిడుదురంటె వేఱొక కఠినశిక్ష గలదా!

వీరాబాయి:—ప్రభువరా! సహధర్మచారిణి యగు సాధ్వి భర్తనెట్టిసమయమందేనియు వీడఁజాలదు. అదియటుండ నిండు. వీరవనితనై, శూరపత్నియగు నీవిపుడు నన్నీ లాగున నిర్బంధించుట పాడియగునా?

ఉదయ:—ఎప్పటిమాటయో యిప్పుడు విచారింపనేల? అట్టిసమయము మొనసినపుడు చూచుకొందము.

సరోజిని:—స్వామీ! యుద్ధము పొసఁగుట యెప్పటి మాటయో యయ్యు రణమునకుఁ బోవలసిన కట్టడ చేఁగల్గిన వ్యసనము మాత్రమిప్పుడు నను బాధించుచున్నది.

ఉదయ:—ఇది సంతోషసమయము. కావున నీకిపుడు వ్యసనము పనిలేదు. ఎట్టిసమయమునను నీవును భర్తను వీడ కుండు లాగున నీకనుజ్ఞ యొసఁగి యున్నవారము.

వీరా:— అమ్మాయీ! నీవు యుద్ధమునఁజూపిన యుక్తియు పాండిత్యమునకిది సరియగు బహుమానమగునా యని తెలుపఁబోయెదవు సుమ్మా. అంగనామణులకిది యద్వితీయ బహుమానమగును. భామలకుఁబతియే దైవము. ఎంత సంపదయున్న నెన్ని సుఖములున్న, నెందఱు బంధువులున్నం బతివినాకృతి యగువాని కవంతయు వమ్మగును. కావునఁ గార్యములపట్ల దాసివై మంతనముల మంత్రివై, యన్నమిడునపుడు గన్నతల్లివై రూపమునఁ లక్ష్మివై, ఓర్పున నిలవై, సుఖముల భోగినివై యీలాగున నారీధర్మముల మెలంగుచు నీపతికిఁ గులధర్మపత్నివై యొప్పుచుండుము. నాథు

డొక్కడఁ గోపించెనేనియు మాతాదక శాంతనైయుండుము. ఎట్టుపట్టున నాతని కీను జనించు లాగున నడుచుకొనుకుము.

సరోజని:-జననీ! మీయాజ్ఞను శిరసావహించెడిదానను.

వీరాబాయి:—అంతయు మేలాయెను. ఆక్రొత్త యోధుఁడు యుద్ధమున నెల్లరు మెచ్చులాగున శౌర్యము చూపినవాఁడు రణ మాఁగినప్పటినుండియుఁ గాన్పించుట లేదు, అతని యునికి మనుకు లెవ్వి యనుటయు మనకుఁ దెలియకున్న యది.

బాలభానుఁడు!—ఆవ్యక్తియుఁ బ్రచ్ఛన్న మగున దేమో యని సంశయించెదను.

వీరాబాయి:—సరోజని మూలమున నీ కందఱి మొదల నట్టినందియు మదయించుచున్నది కాఁబోలు!

బాలభానుఁడు:—వీరరసోద్దీపకములయ్యె మృదుశము లగు నాపలుకులును, క్రోధదర్శిరీత్యము లయ్యుం దకశము లగు నాకయనములను నాకట్టి సంశయము గల్గించెను.

సరోజని:—ఆవ్యక్తియొక్క గొంతు సవ్వడియు నిదివఱ కెచ్చటనో విన్నటులఁ దోఁచుచున్నది. ఎంత యారసియు నిశ్చయము బోధపడుట లేదు.

ఉదయ:—ఇంక నావిషయమై చింతించిన నేమి లాభము? "శుభస్య శీఘ్రి" మ్మనులాగున వీరి వివాహము గావించుట కనువగు ప్రయత్నములు సల్పుట బాగుగదా?

వీరాబాయి:—నాథా! పురోహితునిం బిలువ నంపి ముహూర్త మేర్పఱుపుఁడు.

అంత రాణాగారొక భటుని మూలమున నాస్థానపురో
హితుని రావించెను. రాజదంపతులు వచ్చిన యాతని
గౌరవించి యుచితాసనాసీనుం జేసిరి.

ఉదయ:—సూనర్దారుండగు బాలభానునకును మానవతీ
లలామ యగు సీసరోజినీ బాయికిని వివాహము జరుప
నిశ్చయించితిమి. అందులకుం దగు ముహూర్తము నేర్పఱుపుండు.

వీరాబాయి:—ముహూర్త మత్యాసన్నముగ నుండవలయుండీ.

ఆవల నాపురోహితుం డించుక తడవాలోచించి
పొంతనములు మున్నగు వాని సరిపఱచుకొని;

పురోహిత:—ఇంద్రాణీంద్రులవలె నఖండసామ్రాజ్య
వైభవోపేతులగు నో రాజదంపతులారా! రాంబోవు పంచమీ
బుధవారమున వృషభలగ్న మొక శుభముహూర్తము.
ఆ లగ్నమున వధూవరులకు వివాహము జరిపిన నాయురోగ్య
సంశోభితు లగుదురనుట కావంతయు లోటులేదు.

వీరాబాయి:—అట్లే యొనర్తము,

అంత నాంటి సభ చాలించి, వివాహోచిత సంభార
సజ్జీకరణమునకుంగాం దగువారల వినియోగించి, పరివారము నెల్ల
నంపి, సరోజినితోడ రాజదంపతు లాస్థానమండపమునుండి
వెడలిరి.

## పదునెనిమిదవ ప్రకరణము

## కల్యాణము.

చితోడుదుర్గ మొక్కనాంటి యుదయమున నెల్లెడల
నలంకృతమై యుండెను. ఎటు చూచినను పాడుచు నాడుచు

భజనలు సేయుచుండు వారును, మిత్రులతోడ సరసగోష్ఠి వినోదము లాచరించువారును, వీణావేణుమృదంగాది మంగళ వాద్యముల శ్రవణమున హాయిగఁ గాలక్షేపము సేయువారు నిట్లూరనందఱు సంతోషాంబుధి నోలలాడుచుండిరి. నగర మెల్లెడల సరోజినీ బాలభానుల వివాహప్రశంసయే వినవచ్చు చుండెను. వీధినివచ్చుచు బోవుచునుండు శకటములకు విరామము లేకుండెను. రాజమార్గముల జనులు క్రిక్కిరిసి యుండిరి. నగరమెల్ల నిట్లుత్సాహ పూరితమైయుండ రాచనగరున నొక్క గొప్ప మండపమున వివాహము జరుగు చుండెను. ఆమండపమధ్యమున వివాహవేదిక యొక్కం దయారియుండెను. అద్దాని నాల్గువైపుల నాల్గు స్తంభములు విరాజిలుచుండెను. అటరంభా స్తంభములు కట్టఁబడియుండెను. వధూవరులు మంగళస్నాతులై నానాభరణాలంకృతులై యచ్చటి కరుదెంచిరి. వారా వేదికపైఁగల పీఠముల నాసీనులై యుండిరి. వారియెదుట నగ్నికుండ మమరి యుండెను. అందలి యగ్ని వారికి శుభము లొనగూడఁగలవటంచు సూచించు చున్నదో యనఁ బ్రదక్షిణార్చియై జ్వలించుచుండెను. పురోహితులు మంత్రతంత్రముల నెట్టిలోటులుం గల్గకుండఁ గడుజాగరూకతతోఁ గార్యముల జరుపుచుండిరి. రాజ దంపతులు జననీజనకుల స్థానమునుండి యుక్కన్యం బాల భానునకు ధారాపూర్వకముగ దానముసేసిరి. బ్రాహ్మణు లాచరించు వేదఘోషములు మంగళవాద్యధ్వనులు నేకమై యెల్లరకు శ్రవణానందము సేయుచుండెను. మాంగల్య

ధారణానంతర మా దంపతులు పెద్దలకెల్ల నమస్కరించు చుండిరి. వారు వీరి శిరములపై నక్షతలు చల్లి యాదంపతుల 'కాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధియగును గాత' మని యాశీర్వదించిరి. ముత్తైదువలు కొందఱారతు లెత్తి మంగళములఁ బాడ నుపక్రమించిరి.

ఇట్లు వివాహమంతయుం బూర్ణమయిన పిదప రాజ దంపతులు వారిం జెంతకు రావించి ;

రాజదంపతులు:—వధూవరులార ! గృహస్థ ధర్మాచరణము కొఱకు మిమ్మిట్లు చేర్చినారము. సపాహ్యాల నతిథులఁ దర్పించియు, నౌపాసనాదుల నగ్నిం దృప్తిపఱిచియు, యాగాదుల దేవతల నానందింపించియు, సంతతిని బిత్రూణము దీర్చియుఁ నొండొరు లతిప్రీతిగల్గి యసన్మార్గముల నడుగిడక సత్కర్మముల సమాచరించు చుండునది. చేయునదెల్ల నీశ్వరార్పణమ్ము గావించునది. కర్మల మాత్రము మీకధికారముగాని కర్మఫలముల నధికారము లేదు. ఎప్పట్టున నేవిం గర్మను వీడుటకుఁ గడంగకుఁడు. కర్మత్యాగి యపవిత్రుఁ డని పెద్దలందురు. కర్మాచరణయోగ్యము ఘటంజేయుటచే నీ యాశ్రమ మంతయు సంభావనీయమగును. సదాచరణమున కనుకూలదాంపత్య మత్యావశ్యకము. కాఁబట్టి పూవును దావియుంబోలెను, రత్నమును గాంతియుంబోలెను, శరీరమును నీడయుంబోలె; నొండొరులెడబాయక యనుకూలురై యాపత్సంపదల సమానులగుచుండురని నమ్ముచున్నవారము.

సరోజిని బాలభానులు:— కరుణాసింధులగు నోరాజ దంపతులార! మీయాయాయాసతి జనదాటక శిరమున దాల్చి యుందుము.

రాజదంపతులు:-ఈశ్వరుండు మీ కెల్లవేళల మంగళ ములనొసఁగుచుండుఁగాక.

అప్పుడా సభలోనివా రందఱు "తథాస్తు, తథాస్తు తథాస్తు!" అనియాశీర్వదించిరి. ఈలాగున నందఱానందాంబుధి నోలలాడుచుండిరి. కాని సరోజిని మాత్రము దన చెలి మాలిని గాన్పింపమి నిట్టి సంతోష సమయమునను జింతం దక్క యుండ లేదు. ఆతరుణమున నొక సేవకుఁడరుదెంచి.

సేవకుఁడు:— దేవీ! ఇప్పుడొక సన్న్యాసి ద్వారము కడకరుదెంచి యుండెను. కవచయోగి యను యాతని పేరఁట. ఢిల్లీనగరమునుండి యాతఁడు వచ్చెనఁట, అతఁడీ కమ్మనిచ్చి యాస్థానమునఁ జేర్చుమనెను.

అని యాయుత్తరము మీరాబాయి కర్పించెను.

సరోజిని:—కవచయోగి యిప్పు డెచట నున్నవాఁడు?

సేవకుఁడు:—అమ్మా! అతఁడు దానీ లేఖను నాచేతనిడి యెటకో వెడలిపోయెను.

మీరాబాయి:—ఢిల్లీనగరమునుండి నిన్నాపద పాలుగాక తప్పించిన వాఁ డీయోగియే కదా? ఆతనికి నీవిషయమున నింతటి దయ యుదయించుటకుఁ గారణమేమి యుండును?

సరోజిని;—అదియే నాకుం గోచరింపకున్నది.

బాలభానుఁడు:—"ఎవ్వరి కెట్టి కీడు గల్గనున్న నోపి నంతవట్టు సాయమొనర్చుట మానవునకు విధియగు" నని నా మిత్రుఁ డొక్కఁడాడియుండెను ఈ కవచయోగి యీయభిప్రాయము చేతనే వాత్సల్యమును జూపి యుండుననితోఁచెడిని.

ఈ మాట లాలించి సంతస సరోజిని సిగ్గు సవనత వదన యయ్యెను. వీరాబాయి యందలి మర్మము గనుఁగొని;

వీరాబాయి:—మిత్రునియందుఁ బ్రియము గలవా రట్లాడియుండ నోపుదురు కాని యిది మాత్ర మకారణ వాత్సల్య మనియే నే భావింతును.

సరోజినీ బాలభానుల కీమాటల భావము దెలియుటచే నించుక లజ్జితులైరి.

వీరాబాయి:—కవచయోగి నాకవరిచితుఁడు గాఁబట్టి యీయుత్తరము నందలి విషయము నీకు సంబంధించిన దగు ననియే భావించెదను. కావున దీని నీవే చైకొనుము.

అని సరోజిని కిచ్చెను. ఆబిక యాలేఖవిప్పినంతనే శీర్షిక యందు'మాయాయోగి'యనియుండుటఁగాంచినంశయించుచు

సరోజిని:—అమ్మా? ఇందుశీర్షికను 'మాయాయోగి' యని యున్నది. కావున నీయుత్తరమానఁ దమువిషయ మేదే నొకటి వలచియుండునని తలంతును.

అని యాలేఖను వీరాబాయి కర్పించెను. ఆమె దానిం జెంతనుండు నొక్కసర్దారునొద్ద నీయఁగ నాతఁ డిట్లు చదువఁ దొడఁగెను.

## మాయాయోగి

### చితోడు.

సరోజినిని వీడ్కొని చనిన మాలిని చితోడుగడమునకు వచ్చెను. అట బాలభానుసితో నీబాల వచ్చు కష్టముల విన్నవించెను. ఆబిడ లేఖ నాతనికందఁజేసెను. అంత నాతని వీడ్కొని డిల్లీపురాభిముఖ యగుచు నాఁడు వేసమున మార్గమునఁ జనుట క్షేమావహముగాదని తలంచి యొక బాల యోగి వేషముఁదాల్చి చనుచుండెను. మార్గమధ్యమున నొక మహమ్మదీయునిం గాంచి వాని డిల్లీపురమున నిదివఱలోఁ దాఁ జూచియుండుటచే వానియెడ సంశయముగలదై వెను దవిలెను. వాఁడు రాణాపై గుఱిపెట్టి తుపాకిం బ్రేల్ప నుంకించుచుండ వానిం జంపెను.

ఉదయ:—ఔరా! నన్నుఁ గాపాడిన యాబాలభారతి మాలినియా? ఎట్టిబలము! ఎంతటి సమయస్ఫూర్తి! ఏలాటి మతాభిమానము!—సరి. ఆవలి యుదంతము చదువుము.

అంత నాసర్దారిట్లు చదువ నుపక్రమించెను

అనంతర మాబిడ దారిని జనుచుండ నొక్క తపోధనుఁ డామె కెదుటం బడెను. మాలిని యాతనిపాదములపైఁబడెను. యోగిచంద్రుఁ డామెపైఁ గరుణించి కాళీమంత్ర ముపదేశించి విశల్యకరణియను నొకమూలికం దెల్పి చనెను. తిన్నఁగ డిల్లీ కరుదెంచి యాబిడ తనయోగివేషమును వీడి నిక్కపురూపున సరోజినియింటికరిగెను. అచ్చట నామెం గానక యాపెజాడ

నారయుఁదలంచి వీధుల వెంటం బయలు వెడలెను. అట్టి యెడ రాజభటునకుఁ జిక్కెను. దప్పిదీర్చుకొను నెపమునఁ జెంతఁగల యొక యుపవనిలోని వాపిక చెంత కరిగెను. అట నా యాపదం దప్పుట కేమి యుపాయమని యాలోచించి యొకపుట్టచాటున కేఁగెను. ఆ ప్రదేశమున గందపు చెక్కలచే నిర్మితమగు నొక గోరి గన్పట్టెను. దాని పైభాగమున నొక వెండిపిడి యమరియుండెను. ఆబిడ దానిం దాఁకినంతను నా గోరి రెండు పాయలయ్యెను అటనుండి క్రిందికి దిగ ననువగునట్టి సోపానపంక్తి గానుపించెను ఇదియొక యంతర్గృహమగునని యావిడ దెలిసికొని తన యొద్దనుండు కాషాయ కంచుకము దాల్చి, మాయజడలు ధరించి భటుని వంచించుటకై వాపికలో నొకఱాతిని వైచివచ్చి యా సోపానముల మార్గమునఁ గ్రిందికి దిగెను. అచ్చటఁగల రహస్యాలయమునఁ గొత్వా లబ్బుల్లాఖాను మున్నగువారితోఁ బాదుషాపైఁ గుట్రలుసేయ సమకట్టుచుండ వారల డాసెను. ఆ తరుణమున వా రీవిధముగ సంభాషించుచుండిరి,

కొత్వాలు:—అహమ్మదు! మన యిప్పటి చక్రవర్తి హిందూవనితల వివాహమాడి పవిత్రమగు నీ మహమ్మదీయ మతమునకుఁ గళంకము నాపాదించుచున్నాఁడు.

అహమ్మదు:—తా నొక్కరుఁ డట్లాచరించుట కాక యితరులచే సయితము నట్లే కావించుచున్నాఁడు. మహమ్మదీయ కాంతలఁ గొందఱి హిందువుల కిచ్చి వివాహము గావించి యున్నవాఁడు. కులకాంత లగు మన కాంతల కులముఁ జెడఁగొట్టుచున్నాఁడు. వీనిని ధ్వంసము గావింపకున్న మన మత

ఖుంతరించుము. ఇది నిశ్చయము. సేనాపతుల మన యధీనమునకుం దెచ్చుకొనిన నన్నియు సుసాధమగును.

కొత్వాలు:—అదెట్లు పొసఁగును? మానసింహాదులగు సేనాపతులు మనమాట లించుకయేనియు వినరు కదా?

అబ్బుల్లాఖాను:—చక్రవర్తి యూరలేఁడు. సేనాపతు లెవరు నిట లేరు. కావున మన మారక్షకభటుల సాయమున ఢిల్లీనగరము మన యధీనము గావించుకొందము. రాజధాని మన యధీనమైన పిమ్మట రాజెటు రాలేఁడు. మన మింతలోన సేనల సజ్జీకరించుకొనవచ్చును గాదె!

కొత్వాలు:—ఆ రక్షకభటులకు శిక్ష చాలదు. యుద్ధోపకరణములు మనయొద్ద విశేషముగ లేవు. పాదుషా తిరిగి వచ్చినచో నాతని సైన్యము నెదుర మనభటుల సంఘమునకు శక్తిచాలదు. కావున నది నిరపాయమగు నుపాయము గాదు.

అబ్బుల్లాఖాను:—అయిన నేమి సేయఁ దలఁచుచున్నారు

కొత్వాలు:—నేనావిషయమే యాలోచించుచున్నాను ఎంతయూహించియు నిందులకుఁ దగు వెరవుదెలియకున్నాఁడను

వీరీలాగున మాటలాడుచుండ నాకపటసన్యాసి వారికిం బ్రత్యక్షమయ్యెను. యోగిం గాంచగనే కొత్వాలు విస్మితుఁడై,

కొత్వాలు:—తాపసోత్తమా! మీ రిచ్చటి కేలాగున రాఁగల్గితిరి?

యోగి:—మాకుం బ్రవేశింపరాని స్థలములు గలవే? మేము మీ యూరికి రాఁగనే మీ చక్రవర్తి యాచరించు దుష్కార్యములన్నియుఁ దెలిసికొంటిమి. వర్ణసంకరము సేయు నీతని సార్వభౌముంగా నుంచుట న్యాయము గాదని తలంచితిమి. దివ్యజ్ఞానమున మీ యుద్యమము దెలిసికొంటిమి, మీకుఁ బూర్ణముగఁ దోడ్పడఁ దలంచి యరుదెంచితిమి. మీ కిఁక నా చింత మానుఁడు. కార్యము కొనసాగ ననియే తలంపుఁడు.

కొత్వాలు;—మహాప్రసాదము.

యోగి:—ఊరక యీ గౌరవ వాక్యములచే మేము సంతుష్టులము గాఁజాలము.

కొత్వాలు:—ఇఁక నేమిసేయు మనెదరు?

యోగి:—భూతవశ్యశక్తిని వాని నంత మొందింతుము ఆపల మీ రెల్లరుం గోరుకొన్న యొకరినిఁ బ్రజలపక్షమున నధ్యక్షునిగా నొనర్తుము. అంతవఱకు మీకు మా మాటల జవదాఁటఁగూడదు. కొన్ని యెడల నా మాటల యాంతరాభిప్రాయము దెలియక పోవుటచే మీ కార్యములకు విరోధమగు లాగున గోచరింప వచ్చును గదా! అంత మీకు వెనుదీసినఁ గార్యము చెడుటయు గాక మీకుం గీడు దానఁ గలుగును. కాఁబట్టి యట్టియెడల మా మతులయందలి విశ్వాసమే మీకు శరణ్యము.

కొత్వాలు:—మీ యానతి నెప్పుడును మీ యనుసుంతును

అబ్దుల్లా:— వాఁ డిప్పుడొక రాచకన్నియను వివాహ మాడదలఁచి యున్నాఁడు ఇట్టి యకార్యము లాచరించుట చేతనే మాకనూయ వొడము చున్నది.

యోగి:— ఆమె తలిదండ్రు లట్లాతని కిచ్చుట కంగీకరించిరా?

మహామ్మదు:— ఆబిడ జననీ జనకులు బాల్యముననే మరణించిరి. ఇప్పుడామె యంధకార ప్రాసాదమునఁ జెఱ యందున్నది.

యోగి:— మీరాతని దా సకోజని విషయమా?

కొత్వాలు:— మీ కాబిడ నామధేయ మేలాగున నెఱుక పడియెను.

యోగి:— ఇంత మాత్రము దెలియకున్న నింక మాతపో మహిమ యేమిటి?

ఈ లాగున మాటలాడికొని వారెల్ల రటనుండి బైలు వెడలిరి. ఎవరి దారిని వారేఁగిరి. మాలిని మా యా యోగి వేషము మాని యుద్ధభట వేష మూని చిత్తోడు గడమున కరుగుచుండు సార్వభౌముని సంధించెను. పాదుషా యా యోధుని నిజసైన్యమునం జేర్చుకొనియెను. ఆమెయే రాజ ముద్రాంకితము లగు రెండు పత్రికలసంపాదించుకొని ఢిల్లీ కరిగెను. అట యోగి వేషమునఁ గొత్వాలుని సమీపించి క్రొత్తఁగా నొక్కనిం జెఱనుంచుట యాతనివలనఁ దెలిసి తనయొద్ద నున్న పత్రికల రెండాజ్ఞాపత్రికలు గావించి ఏకభట వేష మూని

సరోజినీ వీరసింహులఁ జెఱఁ దప్పించెను. మరల యోగియై కొత్వాలును సమీపించి, సరోజినిగాన్పింపమునకుఁ జింతించు నాతని, "యాబిడ చచ్చె నటించి యొక దారు ప్రతిమను శవాకృతి గావించి దానిం దహింపు" మని దుర్బోధ లొనర్చి, వానిచేఁ గట్టి కపటనాటక మాడించి వీరభట వేషమూని యా వృత్తాంత మెల్లమంత్రికి నివేదించెను. కపటయోగి యను పేర సరోజినిచెంత కరిగి యానాఁ డతిథులిర్వు రామెయింటికి వత్తురని నుడివెను. ఆవల మంత్రికి సంశయము నివారణ మగుటకై యాతని సరోజినియింటికిఁ బిలుచుకొని వచ్చెను. ఆతిరుణమున ఖాన ఖాను దన్ను వంచించి సరోజిని బట్ట నుద్దేశించుటచేఁ జోరులు ప్రవేశించిరని చెప్పి యాతని నా రక్షకభటుల మూలమునఁ బట్టించి చెఱనుంపించెను. సరోజిని నటనుండి తప్పించెను. గోసాయి వేసమూనినదియు, యుద్ధ భటవేషము దాల్చినదియు, నీబిడయే యగును. మాఱువేష మున నున్న సరోజినిని శేఖామూలమున బైలువెట్టించినదియు నాబిడయేయనుట గ్రొత్తఁగఁ జెల్పం బనిలేదుకదా! ఏక లింగజీ యాలయమున నశరీరవాణియుదయించిన లాగున రాణిగారితో నాడినదియు నామెయే యగును. ఇటనుండి కదలి డిల్లీకి బ్రాహ్మణవేషమున నేఁగి సుల్తానును సమీపించి కొత్వాలుని దుస్తంత్రములం దెల్పి యాబిడయే యాతనికి శిక్ష గావించెను.

చెలీ! సరోజినీ! సుల్తానున కవమతియాయెను. నీకు నను కూల వరప్రాప్తియాయెను, ఇంక దాఁగనేలయని నను బహి

రంగపఱచుకొంటిని. సఖీ! కాళీమంత్రోపదేశము నాఁటి నుండియు నిక్కముగ నేను సన్న్యాసినియే యగుదును, భవదవనకార్య మొక్కఁడుండుడు. నింతవఱకాలసించితిని. ఇంక నే వనవాసినిగాని భవనవాసినిఁ గాఁజాలను. నేనిదె వీడ్కొను చున్నాను. అప్పుడప్పుడు నీభర్తతో వనవిహారమునకు వచ్చు వేళల నినుఁగాంతును. చింతఁ దక్కియుండుము.

ఇట్లు

నీచెలి మాలిని.

ఈజాబుచదివి యాసభలోనివారెల్ల నాశ్చర్యపరవశు లైరి. సరోజిని యించుక శోకించియు మాలిని యప్పుడప్పుడు తన్నుం జూచును గదాయని యెంచి మది నొకలాగునఁ గుదుట పఱచుకొనియెను. జయజయ ధ్వానములతోడను మంగళవాద్య నాదములతోడను నాఁటి వివాహమెల్లరకు నానంద ప్రదమయ్యెను. వీరాబాయి యాదంపతుల గౌరవించుచు, నరి భయంకారిణియగుచు, నెల్లరుం గొనియాడు లాగున నిజభర్తతోడంగూడి రాజ్యపాలనము గావించుచు సుఖంబుండెను.

స మా ప్త ము.

